**PADYALA PALLAKI**

*by*

**Dr. J. Bapu Reddy**

First Edition : **2003**



Price : Rs. **100/-**
US $ **10**

*Published By :*
**Jubilee Publications**
Plot 10, Road 5,
Jubilee Hills
Hyderabad - 500 033 A.P. - INDIA

*Copies Available at :*
**Vishalandhra Publishers**
4-1-435, Bank Street, Vignan Bhavan
Hyderabad and Branches

**Navodaya Book House**
Opp. Arya Samaj Mandir
Kachiguda, Hyderabad - 500 027.

*Printed at :*
**Vipla Computer Services**
*(Designers & Multi Colour Offset Printers)*
Nallakunta, Hyderabad - 500 044.
Phone : 2767 6910

*Dedicated to Dr. V. Malakondareddy, an Eminent Poet, Educationalist, Philanthropist and Promoter of Science and Technology and Culture.*

# అంకితం



| కృతి కర్త | కృతి స్వీకర్త |
| --- | --- |
| జె. బాపురెడ్డి | ఉండేల మాలకొండారెడ్డి |

# ఉండేలకు కావ్యోపాయనం

"పద్యాల పల్లకి" కృతి అంకితం

సీ, దేశభక్తి సందేశ సందీప్తిలో
  పరవశించె స్వతంత్ర భారతాంబ
సీ, నిత్య చైతన్య వీణా శ్రుతులలోన
  సర్వ మంగళమయ్యె శారదాంబ
సీ, రసాద్వైత తత్వారాధనమ్ములో
  రాణించె వేద విజ్ఞాన లక్ష్మి
సీ, శాస్త్ర, సాంకేతికాశంసనములలో
రాజిల్లె మానవ ప్రగతి శక్తి

ముగ్గురమ్మలకును నీవు ముద్దు బిడ్డ
వగుటచే సద్గుణములన్ని అబ్బె నీకు
మానవత్వమె దివ్యత్వమని తలంచు
నాకు; నీతోడమైత్రి ధన్యమ్మె! ఎపుడు.

కర్షకుడవు, కార్మికుడవు
ఆర్ష కళా సంస్కృతీ రసామృత కవితా
దార్శనికుడవౌ నీ పై
వర్షించెను డెబ్బదేళ్లు, ప్రతిభా ప్రభలన్ !

నీ వలెనె నేను సైతము
భావుకతను నమ్ముకున్న ప్రతిభాకవినే
నీ వలెనె నేను, శుభకర
జీవన సత్యాలు వెదకు జిజ్ఞాసువునే !

ప్రవిమల గ్రామ సీమల వ
రమ్యమ్మగ పుట్టి, పదేళ్ల ప్రాయమం
దవిరళ శేముషీయుత న
వాంధ్ర కవిత్వ పట్టుత్వ శైలి ప్రా
భవమును చూపినట్టి సమ
భావ, వివేక సుగంధమాల కొం
డవు, నవశారదామణి క
టాక్ష ప్రదీప్త కిరీటి వీవెగా !

'ఉండేల' వంశ యశమిల
'ఉండేలా' శాశ్వతముగ, ఉజ్వల మతివై
పండించినావు కవితలు
గుండెలు కలవారి జ్ఞాన కోశము నిండన్ !

అద్యతన విద్యలకు, మహి
తోద్యమ విస్ఫూర్తి నేర్పి, ఊరూరకు నీ
పద్యము వలె నడిపించిన
విద్యా విజ్ఞాన శక్తి పీఠివి నీవే !

నేతాజి బ్రతుకు, పునీతమై పోయె, నీ
నిస్తుల కవితా ప్రశస్తి మునిగి
శ్రీ వివేకానందుడే విస్తు పోయె, నీ
పద్యాల తన చిత్రపటము చూచి
మల్లెమాలలు, పరిమళపారిజాతాలు
కొలిచె నీ 'మొగిలిరేకుల'ను మెచ్చి
గీర్వాణి తన అలంకృతులన్ని మరచె, నీ
కల్పనా 'కాంతిచక్రాలు' తాల్చి

రాళ్ళపై, నీవు 'ఒడిసెలరాళ్ళ' పేర
రాసి విసిరిన రమ్యాక్షరాలు, గుండె
గుండెలో కల్పకములయి గుస్తరించి
రాల్చె 'సత్యం, శివం, సుందరం' సుమాలు.

'విలపించే ఉత్తరము'న
విలువల గూరిచిన ఆత్మవేదనలెల్లన్
కలికాలపు కనులకు, మే
ల్కొలుపుగ తెలిపితివి మాల కొండారెడ్డీ !

'పద్య సాహిత్యలోక ప్రవర్ధ మాన
శైల శిఖరాల సవిత ఉండేల కవిత'
అనుచు దీవించె నిన్ను కళ్యాణివాణి
సాక్షియై చూచి నీ కావ్య దీక్ష లెపుడు !

ఏయేరంగములందు కాలిడిన నీ
వే మేటివై నిల్చినా
వాయారంగములందు, కావ్యరచనా
వ్యాసంగమైనన్, జగత్
శ్రేయోదాయక సేవయైన, జన సం
క్షేమ ప్రయాసైన, నీ
చేయం బూనిన కార్యమందు, విజయ
శ్రీ, నిన్ వరించున్ గదా !

ఇంగ్లండున చదివి, ఇండియా ప్రగతికై
పాటు పడెడి దేశభక్తి నీది
ఆత్మవిశ్వాసమే ఆయుధమ్ముగ పట్టి
జయకేతనములెత్తు శక్తి నీది

దేశదేశాలలో తెలుగు భారతి కీర్తి
ఉగ్గడించిన ప్రబోధోక్తి నీది
త్రికరణ శుద్ధితో అకళంక లక్ష్యాల
సాధనపై సదాసక్తి నీది

ధర్మబద్ధమ్ముగా జీవితాశయముల
నిర్ణయించుక సాగెడి నిష్ఠ నీది
కష్ట సుఖముల, సాహితీ సృష్టియందు
మంచి చెడులెంచి పలికెడి మాట నీది !

'సప్తతి' యిపుడు బ్రతుకు ప్రస్థానమునకు
షష్టిపూర్తి నీ సాహిత్య సాధనలకు
పరమ మోదక స్వర్ణోత్సవమ్ము, నీ సు
దీర్ఘ విజ్ఞాన సేవాగ్ర దీక్షలకును.

పద్యాల పల్లకీలో
హృద్యమ్ముగ కీర్తి కన్య ఏతెంచెను నీ
విద్యా వితరణ వినయ స
ముద్యతి గని మెచ్చి వలచి, ఉండేల కవీ!

అందుకే నీకు నా కవి తాంజలినిడి
అంకితము చేయ చుంటి, శివంకరముగ
నా అనంతానుభూతి విహాయసమున
రెక్కలార్చిన భావశారికల శ్రుతులు,
స్వీకరింపుము మన స్నేహ చిహ్నములుగ.

- జె. బాపురెడ్డి

# కృతి స్వీకరణము

"బాపురెడ్డి" నోటి బంగారు పలుకుల
వెలది, తనకు దానెవలచివచ్చి
నాదు హృదిని జేరె, నవసాహితీ జీవ
నమ్ము, నవరసోజ్వలమ్ముగాగ.

అతడు పొందనట్టి అధికారమెయ్యది !
తిరిగి చూడనట్టి దేశమేది !
విశ్వమంత, కవిత వినిపించి, రసికుల
మెప్పు గాంచినట్టి మేటి యతడు

పద్యమ్ము గద్యమ్ము పదునుగా అదనుగా
సృష్టించగల కళా కోవిదుండు
గేయమ్ము ధ్యేయమ్ము ఖేలాసమమ్ముగా
సంధించుసుకవితా సవ్యసాచి
ప్రణయమ్ము ప్రణవమ్ము పాలు తేనియలుగా
కలిపివడ్డించు ప్రజ్ఞానశాలి
అనుభూతి, జనగీతి అసమానరీతి ఆ
లాపించు గానలీలావినోది
పలుకు పలుకున చైతన్య మొలుకుచుండ,
సభను పాలించు చతుర వాక్యాసనుండు
కృతి సమర్పించి, నాకు సత్కృతియొనర్చె
ఇదియె అరుదైన వరముగా నెంతు నేను

అమెరికా తెలుగుల అతిథియై "ఆటా"కు
"తానా"కు క్రొత్త అందాలు దిద్ది
"నెదరులాండ్" విరిసిన మృదుపుష్పచయములు
ఆంధ్రశారద సిగయందు దురిమి
"బ్యాంకాకు" పురిని ప్రపంచ సాహిత్య వీ
ణాతంత్రులకు తెల్గు గీతి నేర్పి,
అమెరికాయేకాదు ఆస్ట్రేలియాదాక
తెలుగు సారస్వత దీప్తినింపి
భావుకతకెట్టి యెల్లలు లేవటంచు
సకల మానవ సౌభ్రాత్ర సౌరభమ్ము
వివిధ భాషల వెలయించు విశ్వ కవికి
"బాపురెడ్డి"కి నేడిదే ప్రణుతిశతము

బాపురెడ్డి మిత్రమా !
డెబ్బదియేండ్లు దాటిననాకు, నవయువ
కావ్యకన్యకు, జంట గలిపినావు,
పాదచారిని నన్ను పద్యాల పల్లకి
జేర్చి, యూరేగింపుజేసినావు
ఇల్లె సర్వంబని యెంచు, నన్ రసరాజ్య
తీరవాహ్యాళిలో దేల్చినావు
సతతసంసార బాధితు, నన్ను కావ్య సం
జీవనితో సేద దీర్చినావు
అరమరలెరుంగని మన వెయ్యంబునేడు
వియ్యముగ మార్చినావయ్యా! విబుధవర్య !
సాహితీ బంధు మిత్రులక్షతలుకురియ,
భారతీ కరకంకణధ్వనులు మ్రోయ

– డా॥ ఉండేల మాలకొండారెడ్డి

# శుభాకాంక్షలు

మిత్రులు డాక్టర్ బాపురెడ్డిగారు ఇప్పుడు పద్యం రాస్తుంటే పాశుపతాస్త్రం సంపాదించిన పార్థుడు బాణాలను సంధిస్తున్నట్లుంటుంది. ఇది ఇప్పటి విద్య మాత్రమే కాదు. 'Child is the father of man' అనే ఆంగ్ల సూక్తి జ్ఞాపకం వస్తుంది. అప్పటి బాలబాపులోనే నేటి ప్రౌఢబాపు పద్యవిద్య బీజప్రాయంగా ప్రకాశిస్తోంది. భావించటంలో, దానిని పాంకంగా పదబంధాలలో బిగించటంలో, లయాత్మక సౌందర్య సృష్టిలా ఆవిష్కరించటంలో ఆయన ముద్ర పద్యకవిత్వంలో పదిలంగా అప్పటికీ, ఇప్పటికీ, ఎప్పటికీ కనపడుతూ ఉంటుంది. దానికి ఈ 'పద్యాల పల్లకి' ప్రతిపద సాక్ష్యం.

డాక్టర్ బాపురెడ్డిగారు పద్యాన్ని ఒక నమూనాను ముందు పెట్టుకొని రాయరు. అనుకరణాన్ని అన్యథాకరించటమే ఆయన ప్రవృత్తి. పాతబడ్డ మాటలు ఆయనకు గిట్టవు. వైచిత్రి కలిగించని భావచిత్రం ఆయనకు నచ్చదు. కొత్తరకం ప్రతీకను పరిచయం చేయకపోతే ఆయనకు నిద్దురపట్టదు. నిరంతర మధనశీలంలో నుండి అమృతం పుట్టినట్లు పద్యం ఆవిష్కృతమవుతుంది. తృప్తికలిగేంతవరకు చికిలిపెట్టి పద్యాన్ని శిల్పమయం చేస్తాడు. ఒక్కొకసారి నాలాంటి మిత్రులకు వినిపిస్తారు. సహృదయస్పందనను పసికట్టి పద్యాన్ని ప్రజలలోకి పంపుతారు. అందువల్లనే ఆయన ఏ అంశంమీద రాసినా అది పుటం పెట్టిన బంగారమే. అయిదు దశాబ్దాలుగా రాస్తున్న పద్యాలలో అచ్చమైన మాధుర్యాన్ని సంతరించుకొన్న కావ్యఖండికలను కొత్తశతాబ్ది పురవీథిలో ఊరేగించటానికి పూలపల్లకి కట్టించారు. తెలుగువారు కొత్తముచ్చటతో చూస్తారు.

" మూగరాళ్ళకు చైత్రరాగముల్ నేర్పెడి
జీవకళాత్మక భావుకుడవు
మోడుబారిన చెట్ల మోముపై చిరునవ్వు
చిగురులు రచియించు శిల్పివీవు"

అవే పద్యం శేషేంద్ర శర్మగారి కెంత వర్తిస్తుందో బాపురెడ్డిగారికి కూడా అంతే వర్తిస్తుంది.

పద్యమైనా, వచనమైనా, గేయమైనా బాపురెడ్డిగారు పక్షపాతం లేకుండా అభిమానిస్తారు. మూడు ప్రక్రియలలో ప్రౌఢరచనలు చేస్తారు. అయినా ఆయనకు

అంతరాంతరాలలో పద్యం ఋతంభరగీతంలా నినదిస్తుంటుంది. దానిని ఆత్మభృంగీ నాదంలా వెలువరిస్తారు. అది ఆయన నిరంతర కవితాశీలం. ఆ శీలాన్ని చిత్రించే అక్షరభూమిక ఈ కవితాసంపుటి.

డాక్టర్ బాపురెడ్డిగారు డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డి గారికి ఈ కృతిని అంకితమివ్వడం ఒక మెచ్చుకోతగ్గ పని. ఉభయులూ ఉదాత్తశీలురు, ఉత్తమ కవులు.

" నీ వలెనె నేను సైతము
భావుకతను నమ్ముకున్న ప్రతిభాకవినే
నీవలెనె నేను, శుభకర
జీవన సత్యాలు వెదకు జిజ్ఞాసువునే"

అంటూ అంకితమిచ్చారు బాపురెడ్డి గారు. అందుకే అంటారు - వియ్యానికైనా కయ్యానికైనా ఒక స్థాయి ఉండాలని - అది అన్నిటా కుదరటం మాలాంటి మిత్రులకు మానసోల్లాసం. ఉభయకవిమిత్రులకూ నా శుభాకాంక్షలు!

- ప్రొఫెసర్ జి.వి. సుబ్రహ్మణ్యం
ఎం.ఏ., పిహెచ్.డి.
వైస్ ఛాన్సలర్
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాద్

# కవితా కళ్యాణికి 'పద్యాల పల్లకి'

పద్యానికి ప్రమాదం' లేదని ప్రగాఢంగా విశ్వసించే ఆశావాదిని నేను. పద్యానికి గేయానికీ ప్రజాధరణ పెంపొందుతున్న రోజులివి. పద్యం, గేయం ప్రజల నాలుకలమీద ఆడుకునే కవితా ప్రక్రియలు. కావ్యపఠనం, కావ్య గానం పట్ల సగటు పాఠకుడు, శ్రోత మళ్ళీ ఇతోధికంగా ఆకర్షితుడౌవు తున్న కాలం ఇది. ఛందోబద్ధమైన పద్యం, మాత్రాఛందోబంధురమైన గేయం రాగ-తాళ, శ్రుతి-లయ విలసితమైన సంగీతానికి సన్నిహితమై తున్న వాస్తవాన్ని స్మరించలేము.

పాటకు, పద్యానికి విస్తృత ప్రాభవం చేకూరుతున్న ఈ శుభ సందర్భంలో నేను కూడా తెలుగు పద్యాన్ని, గేయాన్ని దీక్షతో చేపట్టగలుగు తున్నందుకు గర్విస్తున్నాను. అందుకే నేను వచన కవితలతో పాటు పద్యాన్ని గేయాన్ని ప్రగాఢంగా అభిమానిస్తున్న సాహిత్య సహజీవన వాదిని అని చెప్పుకోవడానికి సంతోషిస్తున్నాను. నాకు ప్రతిభాపక్షపాతం తప్ప ప్రక్రియా పక్షపాతం లేదు. అయితే ఏ ప్రక్రియైన సజీవంగా సంపూర్ణ జవసత్వాలతో వర్ధిల్లాలంటే ఆ ప్రక్రియలో సృజనాత్మకత రసాత్మక ప్రయోజనాత్మకమైన రచనలు శిల్పసుందరంగా భావబంధురంగా వెలువడాలి. ఏ ప్రక్రియకైనా సరైన గుర్తింపు రాకపోవడానికి కారణం ఆ ప్రక్రియ లోపం కాదు ఆ ప్రక్రియలో రచన సాగిస్తున్న రచయితల యొక్క సాధన సంపత్తి కొరతే అని, నా నిక్కమైన అభిప్రాయం.

ఈ దృష్టితోనే మూడు ప్రక్రియల్లో కూడా రచనా వ్యాసంగం కొనసాగిస్తున్న నేను ఏ ప్రక్రియలోనైనా పుష్టికరమైన శివ సుందరమైన రచన కనిపిస్తే కళ్లకద్దుకుంటాను. ఆ స్ఫూర్తితోనే ఈ 'పద్యాల పల్లకి'కిని సాహిత్యలోకానికి అందిస్తున్నాను. ఇందులోని కవితలు ఇతివృత్త వైవిధ్య భరితాలు. నా తొలి పద్యకవితా సంపుటి 'బాపురెడ్డి పద్య కావ్యాలు' 1968 లో వెలువడింది. ఆ తరువాత వ్రాసిన పద్య ఖండికలను ఏర్చికూర్చి

'జీవన శ్రుతులు', 'హృదయ పద్యం' అను పేర్లతో రెండు సంపుటాలు వెలువడ్డాయి. అవి డా॥ శేషేంద్ర శర్మ, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యాం, ఆచార్య కొవెల సుప్రసన్నాచార్య, డా॥ నాగభైరవ కోటేశ్వరరావు, డా॥ గరికపాటి నర్సింహారావు, ఆచార్య ఎస్.ఎస్. ప్రభాకరరావు, డా॥ ఆచార్య తిరుమల, వంటి పద్య విద్యా మర్మజ్ఞుల, సాహిత్య విమర్శకుల ప్రశంసలకు పాత్రమైనవి. ఈ 'పద్యాల పల్లకి' కూడా సహృదయుల మన్ననను పొందుతున్నదని ఆశిస్తున్నాను.

నా గ్రంథాలను ఇంత వరకు అంకితం తీసుకున్నవారందరూ గొప్ప సాహితీమూర్తులే - విద్యా విజ్ఞాన సంపన్నులే - త్యాగ ధనులే. అందులో భారత దేశపు మాజీ ప్రధానులు భారత రత్న శ్రీమతి ఇందిరాగాంధి, డా॥ పి.వి. నర్సింహారావు మొదలుకొని అమెరికాలో ప్రవాసాంధ్ర బాలమేధావి చిరంజీవి రోహన్, వరంగల్లులో వర్ధిల్లుతున్న అద్భుత బాలవర్తికి బేబి దీక్షిత వరకు ఉన్నారు. జ్ఞానపీఠ పురస్కార గ్రహీతలు డా॥ సి. నారాయణరెడ్డి, విమర్శకాగ్రేసరులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యాం, జగద్విఖ్యాత పారిశ్రామికవేత్త శ్రీ బి. రామలింగరాజు, పద్యవిభూషణ్ మహాకవి డా॥ బోయిభీమన్న, సుగుణశీలి బహుముఖ ప్రముఖశాలి పిపీవటుడు డా॥ గుమ్మడి వెంకటేశ్వరరావు, సాహిత్య సాంస్కృతిక పోషకులు, వితరణ శీలురు శ్రీ ఎస్. కొండలరావు, శ్రీ ఎ.వి.యస్. రాజు, ప్రఖ్యాత ఆర్థిక శాస్త్రవేత్త డా॥ సి.హెచ్. హనుమంతరావు, World Acadamy of Arts and Culture అధ్యక్షురాలు శ్రీమతి Rosemary C Willkinson (USA), Dr. Dorin Popa (Romenia) వంటి వివిధ రంగాలలో విఖ్యాతులైన వారెందరికో నా పుస్తకాలను అంకితమిచ్చే అవకాశం కలిగిందని నేటి సందర్భంలో పులకిత హృదయంతో గుర్తు చేసుకుంటున్నాను.

ఇప్పుడు ఈ 'పద్యాల పల్లకి'ని అలంకరిస్తున్న చిరకాలమిత్రులు డా॥ ఉండేల మాలకొండారెడ్డిగారు కూడా నా కృతుల స్వీకర్తలైన

వరణీయులలో గణనీయులు. ఆయన క్రియాశీలుడైన ఇంజనీరుగా దయాశీలుడైన వదాన్యుడుగా సృజనశీలియైన మహాకవిగా కీర్తి గడించారు. మన దేశ ప్రగతికోసం అహర్నిశలు విద్యావైద్య విజ్ఞాన కళాసంస్కృతుల రంగంలో వినూతన పథకాలు చేపట్టి విజయవంతంచేస్తున్న కార్యదీక్షుడు. ఆయన స్థాపించిన ప్రతిష్టాత్మక 'చైతన్య భారతి ఎడ్యుకేషనల్ సొసైటీ-ఇన్స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ', 'షేర్ మెడికల్ కేర్ (మెడిసిటీ) ఆయన అపార సృజనశీలతకు పరిపాలనా దక్షతకు సాక్షీభూతాలు. 'నేతాజీ', 'వివేకానందుడు' కావ్యాలతో ప్రారంభమైన ఆయన కవితా సృష్టి శాఖోపశాఖలుగా విస్తరిల్లి 'కవితా పుష్పకంగా' సంపుటీకృతమైన ఆయన అనేక కావ్యాలు ఆయన నిసర్గనిశిత కవితా ప్రతిభకు అద్దం పడుతున్నాయి. ఆయన వ్యక్తిత్వాన్ని, శక్తి సామర్థ్యాలను అభినందించడానికి ఆత్మీయులు నిర్వహించిన ఆయన 'జీవిత సప్తతి' 'సాహిత్య షష్టిపూర్తి' విద్యావిజ్ఞాన రంగాల స్వర్ణపర్వం-ముప్పేటగా రూపొందిన విజయోత్సవం కూడా ఆయన జీవిత సాఫల్యాలను పూర్తిగా విశ్లేషించడానికి చాలలేదు. నేను అంతకన్నా మిన్నగా ఆయన గురించి ఏమి చెప్పగలను. ఈ 'పద్యాల పల్లకి'ని నా కావ్యోపాయనంగా ఆయన స్వీకరిస్తున్నందుకు నేను ధన్యుణ్ని. మా సహజసుందరమైన ఈ నెయ్యం, వియ్యం అందరికి ఆదర్శప్రాయం కాగలదని ఆశిస్తున్నాను.

ఈ సందర్భంలో నా సాహిత్య యాత్రకు తోల్పడుతున్న ఆత్మీయ మిత్రులకు, శ్రేయోభిలాషులకు, సాహిత్య సంస్కృతిక సంస్థలకు, సాహితీ మూర్తులకు, సహృదయ విమర్శకులకు, పత్రికా సంపాదకులకు నేనెంతో ఋణపడి ఉన్నానని గుర్తుచేసుకుంటున్నాను. ఖండ ఖండాలలో నన్ను గుండెలకు అద్దుకుంటున్న స్నేహితులు, హితులు, మాననీయులు శ్రీ ఆదిల్ నాయుడు, డా॥ డోరిన్ పోపా, కెనారిన్ బోయారయాన్, పబీహ నవీవ్ ఇస్లాం, ఒస్మాన్ టర్కి, బాలాజీ-రాధికా దంపతులు, నవితా-సుధాకర్‌రెడ్డి దంపతులు మొదలైనవారికి నా కృతజ్ఞతాంజలి.

నా సాహితీ యాత్రలో ఎన్నో సాధక బాధకాలు ఓర్చి నాకు తోడ్పడుతున్న నా ధర్మపత్ని రాజేశ్వరికి, కుటుంబ సభ్యులకు శాంతిశ్రీ- మారుతి దంపతులకు, జయశ్రీ-మహేందర్‌రెడ్డి దంపతులకు, చిరంజీవులకు నా ఆశీర్వాద పూర్వక అభినందనలు. నా సాహిత్య కృషిలో నాకు తోడు నీడగా ఉంటున్న అనేకమంది మిత్రులకు ముఖ్యంగా శ్రీయుతులు పి. సుదర్శన్‌రెడ్డి, కె. లక్ష్మారెడ్డి, ఎస్. కొమరయ్య, లంక జానికీరామయ్య, యం.ఎస్. మూర్తి, ఆచార్య ఎస్.ఎస్. ప్రభాకరరావు, డా॥ వి. కొండలరావు, డా॥ పి. మధుసూదన్‌రావు, డా॥ భార్గవీ రావు మొదలైనవారికి నా అభినందన పూర్వక కృతజ్ఞతలు.

మహారచయిత, విమర్శనారంగంలో విశ్వజనీన వినూతన విలువలను వెలగిస్తున్న ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం గారు తిలకందిద్దడం నా అదృష్టంగా భావిస్తున్నాను. వారి సిద్ధవాక్కులు నాకు దిక్సూచికలు అవుతాయని ఆశిస్తూ మనసారా ధన్యవాదాలు తెలియచేస్తున్నాను.

ఈ పుస్తకాన్ని సకాలంలో ముచ్చటిగా ముద్రించిన విప్ల కంప్యూటర్ సర్వీసెస్ వారికి నా ధన్యవాదాలు. నా గ్రంధాలను పాఠక లోకానికి అందిస్తున్న విశాలాంధ్ర పబ్లిషర్స్ వారికి ప్రత్యేకంగా శ్రీ రాజేశ్వర రావు గారికి నా అభివాదాలు.

- జె. బాపురెడ్డి

# ఇందులో . . .

# బాపురెడ్డి గారి మరికొన్ని రచనలు

బాపురెడ్డి గేయ నాటికలు

శ్రీకార శిఖరం *(గేయ సంపుటి)*

నా దేశం నవ్వుతూంది *(గేయ సంపుటి)*

ప్రేమారామం *(గేయ సంపుటి)*

మనసులోని మాట *(వ్యాస సంపుటి)*

ప్రణవ ప్రణయం *(వచన కవిత)*

మన చేతుల్లోనే ఉంది *(వచన కవితలు)*

రంగు రంగుల చీకట్లు *(వచన కవిత)*

వాడిపోని వసంతాలు

కాలం మాయాజాలం *(వచన కవిత)*

బాపురెడ్డి భావగీతాలు *(గేయ సంపుటి)*

సౌదామినీ కవితలు

హృదయ పద్యం *(పద్య కవిత)*

ఆత్మీయరాగాలు

జీవనశ్రుతులు *(పద్య కవిత)*

ఆటపాటలు *(గేయ సంపుటి)*

అక్షరానుభూతులు *(వచన కవిత)*

నవగీత నాట్యం

***ఆంగ్ల కవితలు***

In Quest of Harmony
Longing for Life
Urn of Love
Loving is Living
Anatomy of Time
Verities and Visions

బాపురెడ్డి

# తెలుగువారు

వెలుగులోనుంచి సంచలన జాతకముతో
వెలువడ్డ విబుధులు తెలుగువారు
వేల వసంతాల విజయభత్రముక్రింద
తిష్ఠవేసిన ఘనుల్ తెలుగువారు
దేశకాలజ్ఞాన దీప్తిలో సద్గుణ
తీర్థ మాడిన ఋషుల్ తెలుగువారు
కనులు తెరచి లోకకళ్యాణ స్వప్నాల
తేలు, నిరామయుల్ తెలుగువారు

మన విశాలభారత దేశ మాతృ నయన
తారలీ తెల్గువారిల త్యాగధనులు
వారు వీరన నేల దుర్వారశక్తి
దేశభక్తి దుర్గమ్ములే తెలుగువారు

ప్రభవ విభవాది అక్షయ
శుభ నామక వర్ష చక్ర సుందరకాల
ప్రభను ఉగాది మహోత్సవ
ప్రభోగముగ జరుపుకొనెడి ప్రజలు తెలుగులే!

హిందూ జలధితీర మందు గోదావరిన్
స్నేహధారలుచింద జేయువెవడు ?
శ్రీశైలశిఖరాల చెంత కృష్ణమ్మ చే
చీకట్ల తొలగింప చేయు వెవడు ?
శ్రీరామ సాగర లీలాతరంగాల
సిరులను పండింపచేయువెవడు ?
తుంగభద్రాదయా ధునితోడ రాయల
సీమను రంజింపజేయు వెవడు ?

కర్మ భూమి విశాఖలో కదనుద్రొక్కి
ఘోర దారిద్ర్య రాక్షసిన్ పారద్రోల
ఉక్కు కవచము తొడిగిన యోధుడెవడు ?
ఎవడు? ఇంకెవడి తెలుగువాడేను వాడు?

శ్రీహరి కోటలో ప్రబల శేముషి సాహస శౌర్య ధైర్య సం
దోహము, భారతీయ సమతుల్య చిరంతన సత్య శోధ నో
త్సాహము, అంతరిక్ష పరిసర్పిత సృష్టిరహస్య వేద్యక
వ్యూహములయ్యె, సత్రగతి యోజనలయ్యె తెలుంగు గడ్డపై !

కవికలతప్వృత్తం :

తెలుగులు, తమతమ, అనుపమ
ధిషణను నలుదెసలన్
వెలుగెడి విధమున, ఘనతర
ప్రియకర పథకములన్
అలుపెరుగక నడుపుచు విజ
య పథమును విడువకన్
కలలను, నిజమొనరిచిరి జ
గతినతికుశలతతో

తెలుగు నదులు దిక్కు తెలియని దీనలై
దురపిల్లి కడలిలో దూక నిపుడు
జనశక్తి కట్టిన జలదుర్గములనుండి
బీటు భూముల, పైరుపాటలల్లు
వెర్రి వరదలెత్తి విరుచుక పడిపోయి
పేద పల్లెల ఊడ్చివేయ నిపుడు
హైదరాబాదు దాహము తీర్చ వ్వందించి
స్నేహాధారలను అందించుచుండు

జన్మభూమికి తమ జీవ జలములెల్ల
ధార పోయు ఝరులు, త్యాగధనము వోలె
తెలుగు జగతి 'విలాసము' తెలుపుమనిన
విమల "గోదావరీ - కృష్ణ విభవ" మనుము !

కత్తులతో పరీక్షలు వ్రాయ విద్యార్థి
వరులు కలాలతో వ్రాతురిపుడు
సమ్మెలనుత్పత్తి సల్పు కర్మాగార
ములు సరుకులను సృష్టిసలుపు నిపుడు
కొండ కోనలలోన బండలై పడియున్న
గుండెలు గొంతెత్తి కూయునిపుడు
రెక్కలూడిన పేదరికపు సమాజాలు
'సైబరు' సంస్కృతిన్ సాకునిపుడు

ప్రగతి కొరకు జరుగు పరుగు పందాలలో
అఖిలలోకకీర్తి నందు కొనుచు
తెలుగు జాతి నేడు తెర ఎత్తుచున్నది
నవ్యభవ్య భావి నరచరితకు.

మాలినివృత్తం :
వేదపురాణ వివేక మతుల్ పర
విద్యమహాత్వ వివేచనులున్
వాదవివాద వినాద వితర్క ప్ర
భాసులు, సంఘసముద్ధరణుల్
ఆధునికాభ్యుదయాశయ బద్ధ మ
హాత్ములు, సిద్ధులు, యోగ వరుల్
స్వాదుకళా నవభావ సుధారస
స్రష్టలు భారత తెల్గు మతుల్

# భావచైతన్య భాషానిలయం

విజయనగర రారాజ కవీశ్వరుండు
కృష్ణదేవరాయల పేర కీర్తి గన్న
సత్కళాశోభితాంధ్ర భాషానిలయము
తెలుగు సాహిత్య సంస్కృతి దేవళమ్మ!

ఒక శతాబ్దమునుండి ఓర్మితో, కూర్మితో
    తెనుగింట వెలిగిన దీప మిదియె
మరిచిపోయిన తన మాతృ భాషను, తెలం
    గాణకు నేర్పిన వాణి ఇదియె
మూగవోయిన జగన్మోహన గోల్కొండ
    గళములో మ్రోగిన గంట ఇదియె
జాగృతమ్మైన తెలగాణ జనగణమ్ము
చేత బూనిన చేతనా కేతన మిదె
భాగ్యనగరము, హైదరాబాదునోట
పాడుకొనుచున్న పెనామార్పు పాట ఇదియె!

ఒక గ్రంధాలయమై జనించి
    నవభావోద్యానమై వెల్గి, ఈ
సకలాంధ్రోర్వికి సాహితీవిభవ
    ప్రాశస్త్యమ్ము చేకూర్చి, కా
లకఠోరాగ్ని పరీక్షలన్ గెలిచి
    కళ్యాణప్రదమ్మైన, పాం
థిక ధర్మావనచక్రమై వెదలు
    శ్రీకృష్ణాలయన్ కొల్చెదన్

ముమ్మొందు స్మరియింతు మునగాల ప్రభువైన
నాయని వెంకట రాయుదీక్ష
కీర్తింతు సాహితీమూర్తి, ఛాయాచత్ర
'రావిచెట్టు'ల రంగరావుస్ఫూర్తి
ప్రస్తుతింతును, ఆదిరాజా వీరావేశ
భరితాంధ్ర చరిత దీపన సుస్పష్ట
పూజించెదను ఆంధ్రభోజులౌ, బూర్గుల
మాడపాటిని ఆదిపూడి ఘనుల

సురవరము, విశ్వనాథ, దాశరథి వంటి
దార్శనికులైన, తెలుగు వైతాళికులను
అభిమతింతును దేశభాషాభిమాన
ధనుడనై, తేట తెనుగుపద్యములతోడ !

అభినందింతును, నిరతము
సభలను సన్మానములను, సత్కార్యములన్
శుభముగ జరిపిన, సేవా
సభచంద్రుల, మాదిరాజు నరసింహాఖ్యున్ !

# గొడవల గొంతు కాళోజీ

నరులను రక్షించుటకై
గరళమును భరించినావు గళమున, అల శం
కరుని విధమ్మున, త్రికరణ
కరుణాగ్రహ సత్యశీలకవి, కాళోజీ!

ఆరవదేళ్లకుపైన ఆర్తులు వినిచిన
గొడవల గోడుల గొంతువీవు!
తాడితుల్ అన్యాయపీడితుల్ జరిపెడి
పోరాటముల జయస్ఫూర్తి వీవు
క్షుద్ర కుటిల రక్కసులు లెక్కలూడ్చిన
హక్కుల పాలిటి దిక్కు వీవు
కులమత వర్గ సంకుచిత దుర్నీతుల
డొక్క జీల్చిన జ్ఞానబుక్కు వీవు !

చాకిరేనైన, శాసన సభయునైన
కాటులాడుటకేయన్న కలమువీవు
దుష్టదుర్మార్గశక్తుల దుమమగలుగు
కాళికా భద్రహస్త ఖడ్గమ్మువీవు !

విలువన కూలిపోయె, విమ
వీచముగా చెరగొన్న భూత, రా
జాల మకుటాలు, మోపముల
జాదములాడిన స్వార్థదూర్త, శ
క్తులు పడిలేచి పోయెను, హి
తోక్తుల, మాక్తుల, విప్లవాత్మకో
క్తుల, భయోయబాపుక వి
వర్గ పటుత్వ ప్రబోధ, దాటికిన్ !

కాకతీయుల ధర్మసంగ్రామదీక్ష
పోతనామాత్య స్వాతంత్ర్య చేతనమ్ము
ఆయుధములౌ దరిద్రనారయణుడవు !
రాజ జనరాజపూజ్య కాళోజి నీవు!

ఈ భాగ్యనగరమంతయు
నీ భావతరంగములకు నిలయమ్మే, నీ
వే భాగ్యసీమ నున్నను
మాభాగ్యము నీవె, తెలుగు మాతృసుపుత్రా !

# స్వప్న జగత్తు

ఈ నిరీహా సమీతి బాధా నిశా ప్ర
పంచమందు, నిశారా పవనములందు
నలిగి ఆరెడి బ్రతుకు దివ్వెలను, మాటి
మాటికిని వెల్గు మనుమ కమ్మనగు కలలు.

మానవుడు, పుట్టి స్వప్న బింబములనుండి
భ్రమణ మొనరించు స్వప్న గోళముల చుట్టు
వాసమైయుండు స్వప్న భవనములందు
పైనమై సాగు స్వప్న విశ్వముల చేర.

సకల సృష్టి ఏ మహనీయు స్వప్నఫలమొ?
స్వప్న సంపద లే భావబలుని సృష్టి
యో? కలయె నిజమగు, నిజమే కలయగు
స్వప్న సత్యాలు వేదాంత సాగర మగు.

గతము కన్నట్టి స్వప్నమ్మె కాద వర్త
మానము, భవిష్యమేమొ లీలా నిగూఢ
ముగ వెలుగు వర్తమానంపు మూగకముల
కొనలయందున, సాంధ్య జీవనములందు.

మొగ్గ కన్నెలు తొలి వలపు కలలందు
మధుపగీతాల తేలి సంబరము మీర
ఉదయరాగ లతాంతాన నిదుర లేచి
నవ్వు చిగురులతో తేలి నాట్యమాడు.

శర్వరీ నీల నిద్రలో స్వాప్నికాను
భూతి రేఖలె మెరుపులై పూయు నేమొ?
దిన సుహాసిని, గాఢ నిద్రను వెలుంగు
చూచి, మందస్మితోషసై లేచు నేమొ?

కలలలో పుంజా కోడి రాగల వెలుంగు
పుంతలో తానమాడి, ప్రబోధ భావ
గళము సారించి, నిదురలో గల యెదలను
మేలుకొలుపును, మేటి వైతాళికు నటు.

ఆశ లేకూడు; గూడే మొ ఆపదలుగ,
బ్రతుకు, శ్రామికజనులు స్వప్నములలోన
హాసవాసంతలక్ష్మి తద్వాసములకు
కదలివచ్చుట చూచి, సొగెదరు ముందు.

కాటువేసిన యవు డెడబాటు పాము
ప్రణయ జీవుల వెతల మూర్ఛనలలోన
సిత కపోతములై వచ్చి సేదదీర్చు
కలల గుండెలలో ఎంత కరుణ గలదొ!

కాళిదాసుని విరహాంపు కలలు, గంట
మున విజృంభించి మ్రోగె యక్షుని గళాన,
శిల్పి రస కల్పనా స్వప్న సీమలే ఆ
జంత ఎల్లోర గుహల వాసమ్ముచేయు.

పరమ కవి భావనా స్వప్న వరసిలోన
పొంగు నవ నవాక్షర కావ్య పుష్పరుచులు

స్వప్న గంధర్వ కిన్నెర స్వాదు గీత
ముగ్ధ హృదయమ్మె సంగీతమునకు నెలవు.

శ్వేత గజసమర్పిత జలజాత సుప్ర
సన్నతా స్వప్నమును కనకున్న ఉదయ
మొందునే తల్లి గర్భమ్మునందు శాంతి
దూత అజ్ఞానజేత బుద్ధుడు జగాన.

శాస్త్రవిజ్ఞాని మస్తిష్క స్వప్రయోగ
శాలలో తేలిపోవు స్వప్నాలె, రాతి
యుగమును నడిపించెను అణుయుగమువరకు
కల్ల యనుకున్న దెల్ల సాక్షాత్కరించె.

నరుని కిల స్వప్నమే చేతనా రథమ్ము
కలల-అలల జీవనకథ .ఇల చరిత్ర
నరుడు స్వప్న జగమ్మునే నాడు వీడు
ఆ దినమె సర్వసృష్టికి అంతిమమ్ము.

కోరి కోరి నే స్వప్న చకోరమౌదు
స్వప్న రోదసి వాకగా సాగిపోదు
రండి నా వెంట స్వప్న తారా పయోద
మోద గంభీర సాగరోర్ములను తేలి !

(చిన్ననాటి రచన)

# వసంతోదయము

ఈ రసాల వృక్షాల కోయిల గళాలు
పోసిన సుగాన సుధ త్రాగివేసె నేమొ?
మండుటెండల గ్రీష్ముండు బెండు వోవ
మధువుతో పొంగు లెత్తె నామ్రఫలజాతి.

లాగెనో లేదా పసుపు చేలాలు ప్రియుల
శిశిర దుశ్శాసనుండు గర్జించి వచ్చి,
పచ్చపచ్చని క్రొవ్వలిపమ్ము లురల
వనకుమారి వసంతయై పాడె నదిగో
ఏ మురారి మొరాలించె నేమొ కాని !

కరుడు గట్టిన హిమశిలల్ కరిగి ఝరిగ
పారె వాసంత కోష్ణ నిశ్వాస లందు
విప్లవోష్మస్వినీ క్రాంతి వీక్షణాల
కరిగిపారెడు దాస్యాంధకార మట్లు.

విచ్చిన సుమాలు మధువుల వెల్లివిరిసె
భ్రమరయువకాళి ప్రణయగీతముల కరిగి
హెచ్చిన వియోగబాధ నా ఎద రగుల్చ
భావకవి చేసె నన్నొక దేవి మోవి.

నాడు శిశిరాన ఓదార్చినాడు, ఏడ్చి
నాడు కవి జీర్ణ లోకమ్ము చూడలేక ;
నేడు వాసంతమున పొంగినాడు పాడి
నాడు శుభగీతి, ముందుండినాడు నేడు.

# ప్రేమ పరీక్ష

నా నవోన్మేష యౌవ నానంద సరసి
లో జనించిన ప్రణయ సరోజములను
అమల ప్రేమాంజలి ఘటించి అర్పణమ్ము
చేయ నీ చరణాలకు - త్రోయ నేల ?

పేద నని ఎంచినావొ నన్ ప్రేమమూర్తి !
వెర్రి నని ఎంచినావొ తపింప జూచి ?
కాను నిర్భాగ్యుడను, వెర్రిగాను నేను
నా మనః పేటి దాచితి ప్రేమ ధనము.

జీర్ణ పర్ణకుటీర విశీధ వాసి
నైన నేమాయనే నిర్దయాత్మురాల !
మనకొరకు శాశ్వతానంద మధుర భావ
గాన సౌధాలు నిర్మించినాను రమ్ము.

ఎద ఎద వసించి, హసియించు, ఎగసి ఎగసి,
ఇంద్రలోకాలు కూడ జయించి, మృదుల
జలదశయ్యల సౌదామినులు కొలువ సు
ఖించ మోహించి నిన్ను ప్రేమించినాను.

అచ్చర కన్నె వంచును ఉ
  షాంగన వంచు, తటిల్లతాంగ వం
చెచ్చట లేని ప్రేమ ప్రక
  టింప, నటింపను; అట్టి కన్య పై
ఇచ్చయు లేదు; చల్లగ చ
  లించెడి మానవతాంక మందునన్
విచ్చుచు నున్న విన్నెద జ
  పింతు వరింతు, మనుష్య భామినీ!

సుందర గిరి స్రవన్నదీ మంద మంద
గీతికారావ మలయానిలాతి శీత
కాంతిపూర్ణ ప్రశాంత వనాంతర సువి
హార మోహన స్వప్నము లవియె చాలు.

ఇంత ఏడ్పించి ప్రేమ బాహ్యాంతరముల
నంతరించితివా సుప్రశాంత హృదయ !
ఎంత రసికవు ! ఇటు పరీక్షింతు వటవె ?
కొంత తడయుము నిను పరీక్షింతు నేను.

(చిన్ననాటి రచన)

# వధూవరులకు శుభాకాంక్షలు

సౌభాగ్యవతీ! వధు, చిర
శోభాయుతమంగళగుణ సుందరవర! మీ
స్వాభావిక కళ్యాణ
ప్రాభవమును చూచి ప్రకృతి పరవశ మొందెన్!

పాణిగ్రహణమన్న పరియణ మన్నను
లగ్నము, పెళ్లి, కల్యాణ మన్న
భౌతిక దేహాను బంధ మొకటే కాదు
ఆత్మానుషంగ యజ్ఞామృతమ్ము
ప్రణయకలాప జీవనహేలయే కాదు
ప్రణవ యోగత్వతత్వానుభూతి
సంతాన దాయక సంసార మే కాదు
ముక్తి దాయక శక్తి మూలధనము

ధర్మ సూత్రైక వేదశాస్త్ర ప్రమాణ
బద్ధమైనట్టి ఈ మీవివాహక్రతువు
జన్మ జన్మల సత్కృతి జాతకమ్ము
అతిపవిత్ర రసాద్వైత వ్రతము ఋతము !

ఓ శివమందర సత్య మ
హోశయులారా, పరప్పరాంకితులారా!
మీ శిరములపై కురిసెను
ఆశీసులు, ధర్మబోధనాక్షరములటుల్ !

ఓ వధూమణీ! నీ కాంతు లొలుకు నవ్వు
పొడ మిడిన వదనని వంశ వాసమిప్పుడు
శ్రీనివాసము, సంపత్ప్రదాన సురభి
ప్రేమ, సంక్షేమ విలసితారామ, మాను!

అర్ధాంగివైన సతి, నీ
కర్ధాంగమేకాదు, జీవితాంతము సుఖ సం
పక్షక పూర్ణానంద స
మర్ధనియౌ సత్యశాంతి మణియౌను వరా!

స్మిత పూర్వక భాషణ వి
ద్యుతితో, విజ్ఞత, వివేక యుత హితములు, నీ
పతి కందించుము, నవ జీ
విత సారథివై సుధా కవిత వౌచు వధూ!

దీవించినారు సంతృప్తులై దివినుండి
      వేద మంత్రోద్ఘోష వినిన సురలు
దీవించినారు సందీప్తాత్ములై, మాన
      నీయులు మీ జననీ జనకులు
దీవించినారు ప్రేమావేశమున తేలి
      వచ్చిన మిత్రులు బంధు గణము
దీవించినారు విదేశాలలో నుండి
      రాలేని శ్రేయోభిలాషు లెల్ల

విరిసినది, కురిసినది దీవెనల విరులు
క్రమ కల్యాణ వేదికా కల్పతరువు
మీ అలంకృత శిరముల మీద; మారు
మోగె నాదస్వరమృదంగముల గళాలు

రంగురంగుల పట్టు చీరలు ధరించి
శక్తికొలది ఇల్లాండ్రు భూషలు ధరించి
వచ్చి, మీ ఈడు జోడును మెచ్చు కొనుచు
ఇచ్చు దీవెనల్ మీ వెంట వచ్చు నెపుడు !

వచ్చిన వారు బంధుహిత
వర్గమెకాదు హిమాలయోన్నతుల్
తెచ్చినవేమొ లాంఛనము
తీర్చెడి కాన్కలె కాదు, దేవతల్
మెచ్చెడి ఛందముల్ అతుల
మృష్ట రసాక్షర కావ్య గంధముల్
పుచ్చుకొనండి! ఈ కవివరుల్ ఋషివర్యులొసంగు తీర్థముల్!

కలిమి కొరకు ఖండ ఖండాలు తిరిగినా
విడువతగదు చెలిమి వెలుగు త్రోవ
విద్యలెన్ని నేర్చి విజయాలు పొందినా
వదల వలదు కన్న వారి మాట !

కలలు నిజమ్ము చేసుకొన
గల్గెడి యోగరహస్య వేదులై
పలిలము పాలువా సుమము
సౌరభమట్లు పరస్పరమ్ము న
మ్మ్మిళితమనమ్ములై, బ్రతుకు
మేడలలోన పదాశయాల జ్యో
తులు వెలిగించుడో నవ వ
ధూవరులార శుభంబు మీకగున్.

బాపురెడ్డి

# శేషేంద్ర సృష్టి

తొలుత సేభాష ఋతుఘోష పలుకుచెలిసె
ప్రకృతి డోలల ఊపిన పద్యభాష
ఇప్పుడు నీ భాష జనకోటి హృదయ ఘోష
క్రాంతి కల్యాణ వర్తక గద్యభాష!

నాడేమొ శరజ్జ్యోత్స్నవు
నేడో సూర్యాభ విభమనేసిపి, నీ వే
నాడైన విప్లవాత్మకు
తోడైన కవీశ్వరుడవె ద్యుతివే శేషన్!

మూగరాళ్లకు చైత్ర రాగముల్ నేర్పెడి
జీవకళాత్మక భావుకుడవు
మోడుబారిన చెట్ల మోముపై చిరునవ్వు
చిగురులు రచియించు శిల్పి వీవు
గూడు లేనియు రెక్క లూడిన పక్షుల
గోడులు వినుపించు గొంతు వీవు
శిశిరాల దాడికి చెదరి పోవు వనాల
ఆదుకొనెడి పిక నాదమీవు

నీ రసోజ్వల ఊహలు నిమరగానె
మారు మూలల పడియున్న మాటలైన
మూర్ఛ చెందిన జనగణ ములను బ్రోవ
వచ్చు, సంజీవినీ గిరి వలనె లేచి!

తెలుగు నిఘంటువుల్ తెలుపనేరని, అర్థ
ములు నీ ప్రజాళికి బోధపరచి
కొంపలంటించిన కుటిల నీతి చరిత్ర
గుట్టులెల్ల బయట పెట్టిపెట్టి
గాడితప్పిన కాల గతుల నీ కృతులతో
గమ్యమ్ములనుచేర గలుగజేసి
ఒకదానికొకటి పొందిక లేక వంచించు
త్రికరణమ్ముల నిలదీసివేసి

చిరు చమత్కారికల పేర చేసి రచన
త్రిభువనమ్ముల తలలను త్రిప్పినావు
రంగురంగుల చీకట్ల రట్టు గుట్టు
పట్టు విడకుండ బహిరంగ పరచినావు !

పలుదేశమ్ముల సంస్కృతీ విధుల
ప్రాబల్యము కన్పట్టి, ప్రా
చ్యాల జిజ్ఞాసువు నీవు, ఫ్రెంచికవితా
పానమ్ము నందించె, నీ
కల బోద్లెరు మహా కవీశ్వరుడు, ది
వ్యద్దివ్య భావాను భూ
తులలో పొంగెను నీచిదాత్మ కవితా
ప్రైకాష్ఠరాం బోధియై

"ఆధునిక మహాభారత" మందు అద్భు
తమ్మని వ్యాస రచనా విధమ్ము గాన
అతిరథ మహారథుల మెప్పులందుకొనిన
సత్య సాహిత్య సమర విశారదుడవు !

కవిసేనా నాయకుడవు
నవతా సమతా ప్రబోధనాత్మక కవితా
సవితా ప్రతి రూపుడవై
ప్రవచించితి నీవు ప్రగతి భావ శ్రుతులన్ !

"జనవంశ" భాగ్యమునకై
అనుదినము తపించునీదయార్ద్ర హృదయమే
ఘన 'మానవేతి హాస
మ్మును' సృష్టించినది మార్గ మును చూపుటకై!

# శవశక్తి

శవములు లేచు చున్నవి, శ్మ
  శానము నుండి; సవాలు చేయుచు
న్నవి; తమ జీవితాలను, వి
  నాశము చేసిన క్రూరఘోర శా
త్రవ విషగర్భకోశ తిమి
  రమ్ముల చీల్చెదమంచు నేడు - భై
రవ మరుభూమి నుండి అజ
  రామర జీవన శక్తి లేచెడిన్ !

శవములు కావట అవి వి
ప్లవ భావావేశ సృజన వాసంతమహో
త్సవ జీవన రాగములట
శివసుందర సత్యసమర చిద్రూపము లౌ!

శివుడెవ్వరో ఈ విశీర్ణాలయమ్ముల్లో
  నవజీవనానంద నాట్య మాడు
కన్నయ్యా ఎవరో కంకాళశల్యాలతో
  నవ చేతనాత్మ గానమ్ము చేయు
చితికిన గుండెలద్భుతముగా గొంతెత్తి
  ఓంకార నాదాల శంఖ మొత్తు
బూదిలైనవట్టి ఆశాదీప కళికలే
  ప్రజ్ఞాన సవితలై ప్రజ్వలించు

మాయ దాడికి భీతిల్లి మట్టి లోన
ఒరిగిపోయిన నరుల ఊపిరుల విరులు
మేలుకొని వికసించె కిర్మీర హాస
కాంతి పరిమళ చిరప్రకాంతి తోడ!

పపమయూర వృత్తము :

మానవుల జీవిత ప్రమాదములు పోవున్
దోపిడుల, మోసముల దౌర్బలము కూలున్
క్రాంతికిని శాంతికిని కష్టములు తీరున్
జాతికిని నీతికిని జాడ్యమ్ము వీడున్

## ఇతి కర్తవ్యం

మానవు డాత్మ వీడి, పర
మాణువు గూడియు, స్వార్థతా సురా
పాన మదాంధుడై తన ప్ర
పంచములో విలయాగ్ని రేపగా
పూనెడి కుట్రలన్ తెలిసి
భూ జనయిత్రి, ప్రియాన కన్న నం
తానవు ద్రోహబుద్ధికి మ
నమ్ము విదల్చుక ఏడ్చె నల్లదే !

తరతరాలుగ తాను బాధలకు నోర్చి
పెంచి పెద్దచేసియు చదివించి, శక్తి
మంతులను చేసి, ఇకపై సుఖింతు నంచు
ఎంచు ఉర్వర హృది కత్తిరించు నరుడు.

ఛీ! దురితాత్మ ! గుండెపయి
చే యిడి చెప్పుము మానవా! రణో
న్మాదము మర్త్యరక్త రస
మాంస బుభుక్షలు పొంగులెత్తి నీ
లో దుమికిల్లలేదె ? సుర
లోకము చూపెడి నీ స్వతంత్ర శాం
త్యాది ప్రసంగముల్ విష మ్ము
షాత్మక మైనవి కా దనందువా !

అసురుల నేల గూల్చి, కుటి
 లాత్ముల పేల్చి, తపించి, ఘోర సా
హసములు చేసి, మానవత
 కాయువు పోసి, సుసంస్కృతీ వసం
త సుమ వనమ్ము పెంచిన గ
 తమ్మది నీది; స్వసృష్టి నేడు తా
మసమున బూది సేయుదువె?
 మర్కటమానవ! దానవుండవై!

విశ్వసాహిత్యాలు, విసము గ్రక్కెడు నీదు
 గుండెలోతుల దూరి మండిపోవు
చిత్రలేఖనము నీ శిశిర తాండవములో
 శిధిలమై వికృతమై చితికి పోవు
శిల్పమ్ము నీ భయోత్కల్పక యంత్రాల
 కాంచి కంపించి వికల్పమొందు
మానవత్వము నీ అమానుషతత్త్వమ్ము
 చెరలో బడి ఉపవసించుచుండె

హంతుకుడ వని వినుగని 'శాంతి' బెదరి
అడవులంబడి పారిపోయెడిని, జీవ
కోటు లాక్రందనమున సంక్షోభ మంద
ఏమి సాధింతువోయి, నీ వింత చేసి ?

యంత్రముల మాయలో చిక్కి, ఎంతలోవ
మనిషి! మనిషిని వేటాడ మరగినావు !
పశుబలవతాక లెత్తు నీ ప్రజ్ఞ చూచి
పరిహసించు నోరెరుగని ప్రాణు లవియు.

ఇలపైనున్న సమస్తమున్ గెలిచి నీ
విన్నాళ్ళుగా బుద్ధి శ
క్తులచే కాంచిన దివ్య భాగ్యముల-నీ
దుర్మార్గమున్ వీడ ఉ
జ్జ్వల సౌభ్రాత్రము సౌమ్యమున్ వెలుగ వి
శ్వమ్మంతటన్ పంచి, శాం
తి లతల్ పెంచుము, ప్రేమజీవనములన్;
దీవించు నిన్ సృష్టియున్.

# ఆశల ఉగాది

వచ్చె ఉగాది, వచ్చె ప్రతి
        వత్సర మట్టులనే వసంతమున్
తెచ్చెను, వృక్షముల్ లతలు
        నిర్మల పల్లవ పుష్ప శోభతో
ముచ్చటగొల్పె, కోకిలలు
        మోహనరాగము లాలపించగా
పచ్చని మామిడుల్ కనుల
        పండువుగా కుసుమించి కాచెగా!

మామిడి పూచినట్లు మధు
        మాసము హాసము చేసినట్టు లా
రాముములోన కోకిలలు
        రాగము లల్లిన యట్లుగా, కవి
స్వాములు ఈ ఉగాది దొర
        సానికి స్వాగత గీతు లల్లు టిం
కేమిటి కన్న నేను కవి
        నే అయిపోయితి ఈ ఉగాదికిన్ !

ఇందుకె నా మనమ్ము విజ
        యేందిరకున్ మనజాతి జీవనా
నంద వసంత లక్ష్మికి ఘ
        నమ్ముగ స్వాగత గీతి పల్కు ఇం
దిందిర మయ్యె; సత్యవలె
        దేశరథమ్మును ఈ ఉగాదియే
ముందుకు త్రోలగా చితికి
        పోవలెరా నరకుల్ నరాసురుల్ !

మనిషిని మార్చగల్గెడి స
మర్థుడు మానవుడేను, కాని ఆ
మనిషియె మానవాళికి ప్ర
మాదములందు ప్రమాద మయ్యె, ఏ
మనిషి జగమ్మె స్వర్గముగ
మార్చెడి రాగ సుధామయుండో ఆ
మనిషియె ద్వేష హాలహాల
మార్గమునన్ కను నారకమ్ములన్ !

శిశిరమ్ము తలదన్ని శిరమెత్తి నిల్చిన
ఎనలేని వనరమ ఈ ఉగాది
కంటకాలను పూలమంటల గాల్చిన
హేలావిలాసిని ఈ ఉగాది
బెల్లమే మామిడి పిందెయే వేప పూ
వే గొప్పయని చెప్పు ఈ ఉగాది
ఎండనాగుల బారినుండి లోకమును ర
క్షించు ప్రపాబాల ఈ ఉగాది

గున్న మావులవలె పేద గుండె లన్ని
పూచినవి నేడు ఆశల పూలు, కలలు
పండుచో వచ్చెడి ఉగాది పండుగను మ
హా వసంతుడనై కళ్ళ కద్దుకొందు.

బాపురెడ్డి

# సౌందర్యేశ్వరి

అందాలుచిందు నీ మందస్మితమ్ములే
    కాంతులీనాడు నా కన్నులందు
ఆటాడు నీ కాలి అందెల రవళులే
    స్పందనలిపుడు నాడెంద మందు
మౌనరాగాల నీ మాటల మధువులే
    కావ్య వస్తువులు నా కవిత లందు
నిస్తులమైన నీ వాస్తవరూపమే
    ప్రణయాత్మ, నా భావ ప్రణవమందు

నీ ప్రమాశక్తి నాలోన నిండగానె
చితికి పోయెడి బ్రతుకు నన్ చేర దీసె
చేరువైన మృత్యువు మన చెలిమిచూచి
మారిపోయెను కేల్మోడ్చి పారిపోయె !

చదివి చదివి శాస్త్రాలెన్నొ చదివి చదివి
రాసి రాసి కావ్యాలెన్నొ రాసి రాసి
చూసి చూసి దేశాలునే చూసి చూసి
తెలిసికోలేని, సత్యాలు, తెలిపినామ !

ఎవరు నీవంచు అడుగలేదెపుడు నిన్ను
నన్ను గుర్తించినట్లు నీవున్న కతన,
"నీవు ఎవర"ని అడుగలే నీవు నన్ను
పరిచయము చేసె నీమొ నా పసితనమ్మె !

చక్షువులు చూచి, నిను కమలాక్షియంటి
చాలదన్నట్లు నీ చూపు చప్పరించె
కనులు కావులే, స్వప్నాల గనులు అంటి
"వాస్తవమె" అని నటు మోము వాల్చినావు !

కలికి మత్యాలు, రోజాల తళుకు మీద
కనుల కాంతుల కలముతో కవిత వ్రాసి
భాష లేనట్టి భావాల పాటచేసి
రంగు రంగుల నీ ముఖ రంగమలర
పాడినవి, నేను మూర్ఛిల్లి పడుటచూచి !

మలయ మారుతమట్లు నీ చెలిమి స్మృతులు
సోకినపుడు, నామేను సుశ్లోక మగును
"పొంద జాల నీ పొంద" ను స్ఫూర్తి యే మొ
మాన్య డనుకొన్న నను త్రోయు శూన్య మందు

యుద్ధోన్మాదులు, రాక్షసాధములు స్వా
 ర్థోన్మత్తులున్, దుష్టదు
ర్బుద్ధుల్ నేర్చిన కాలకంటకులు,
 క్రూరుల్, హంతకుల్ సైతమున్
శుద్ధాంతః కరణ ప్రదీప్త భవద
 స్తోకాత్మ సౌందర్యముల్
శ్రద్ధాభక్తుల కాంచిరేని, నిజ
 ధర్మత్రాతలైపోవరే !

నవమయూర వృత్తము :
నీ కనుల నీలిమలు నింగిఒడి నిండెన్.
నా కనుల చీకటి ఘనా ఘనము లయ్యెన్
నీ కలల తారకలు నింగిదిగి వచ్చెన్
నా కలిమి కోరికల నందనము విచ్చెన్.

# అనుతాపము

ఒక ప్రభాత సమీర వీచికను తేలి
వచ్చి, నా జీర్ణ జీవిత పర్ణశాల
జొచ్చి, చూచి, నిట్టూర్చి, అశ్రులకు బెదరి,
ఏల మరలి పోయెదవె ఆశా లతాంగి!

మంచువలె నున్న నన్ కదలించి, భావ
నా ప్రపంచాన దించి, ఉష్ణమ్ము నించి,
గగన మంట పొంగించి నన్ గడియలోన
నేలపై కూల్చితివి శిలవోలె బాల!

ఏమయి పోయె నేను రచి
యించిన ఈ చిరుగాలి పైని శో
భామయ స్వర్గసీమ ? నవ
భావికళాత్మక సౌఖ్యజీవితో
హో మధురానుభూతి ? నుడి
కందని స్వప్న జగ ద్విహారమే
దే మయి పోయె? ఇంక శమి
యింపవొ ఈ పిడుగుల్ తుఫానులున్ ?

ఈ పూ లతల మాటునే విషసర్పాలు
పొంచి యుండుట నే గ్రహించనైతి
ఈ మృదు జలదాలనే భీషణోల్కాశ.
నులు గల వంచు నే తెలియనైతి
ఈ సిత జ్యోత్స్నలోనే నీలి నీడలు
తిరిగి వేటాడు టే నెరుగనైతి
ఈ నిశ్చలాంబుధియే పొంగిపడి తాండ
వించుట నే విలోకించనైతి

అరరె! ఈ జగజ్జీవ లాస్యమ్ములోని
మృత్యుదేవత పాదాలమీద విలయ
కింకిణీ క్వాణముల నాలకించనైతి
ఆశ ! నీ మీది మోహాన మోసపోతి!

ఊహల మత్తులోన యువ
తోర్వశి గానతరంగ డోలలో
నా హృదపూర్వ శిల్పకృత
నవ్య కళాంబర సౌధమందు, నా
దేహము గేహమున్ మరచి
దివ్య పథమ్ముల స్వప్న చంచలా
వాహన మెక్కు టేల, భువి
వ్రాలిపడన్ పరితాప మేలకో ?

గతకాలోగ్ర వనమ్ము దాటితిని దుః
ఖమ్ముల్ దిగ్ మ్రింగి, శా
శ్వత సౌఖ్యాలయ మీవు చేర్తు వను వి
శ్వాసమ్ముతో ; వమ్ముచే
సితి వీ నాటికి సర్వభావనలు, పై
జీవింతు నే రీతి ? కా
ల తమో గర్భమునందు భావియు కనన్
రాదాయె ఆశాంగనా !

తృష్ణ బంధాల నన్ను బంధించు కొనుచు
విశ్వమెల్ల ప్రేమించి జీవించ నేర్చి
వాస్తవజ్ఞాన భాస్వర పథము నడచు
టొకటె సుఖ మనిపించు, కోరికల రాణి !

బాపురెడ్డి

# సుప్రభాతము

సుప్రభాతము, ఓ వసంత ప్రసూన
వనములార ! ప్రాభాత శోభా ప్రదీప్త
మిత్రులార ! కళా జగచ్చైత్రులార !
ఉజ్జ్వల నవీన వర్ష మహోదయాన
సుప్రభాతము -

ఆ కుసుమిత వనవిలాసినీ కచమ్ము
వోలె నా యెద నాశా సుమాలు పూచె,
పిక లసద్గాన పులకిత ప్రకృతి భంగి
మన్మనము భావ సౌరభ మగ్న మయ్యె.

ఎన్ని వసంతముల్ గడిచె
నెన్ని ఉగాదులు వచ్చి పోవలే
దెన్నడు నాకు ఇట్ల వచి
యింపగరాని మహానుభూతి గ
ర్వోన్నతి కల్గలేదు; భర
తోదధి నాంధ్ర మహాతరంగ మి
ట్లెన్నడు అంబరోన్నతి గ
మించుచు పొంగుచు పాడలేదురా !

బాల బాలికలు పుష్పాలవోలె ప్రభాత
వేళ ఆస్యాల హాసాలు నింప
ప్రతి గృహ మ్మొక పల్లవిత మహీరుహ మట్లు
పచ్చతోరణముల పరిఢవిల్ల

యువతీ యువకులు కలవిహంగముల కిల
 కిల లట్లు పరిహాసములను విసర
ప్రతివాడు మలయ మారుత వీచు లట్టు లు
 జ్జ్వల భావి తావి శ్వాసలు వెలార్చ
ఎటుగనిన రాగ మంగళార్భటి చెలంగ
పటుతరోత్సాహ దివ్య ప్రభలు వెలుంగ
నేడె ఊరూర వనలక్ష్మి నిల్చి, యింపు
గా ఉగాది జరుపుకొను కరణి తోచు !

తెల్లని వేపపూ వొగరు
 తీరిన మామిడికాయ బెల్లమున్
చల్లని నీట కల్పిన రస
 మ్మును దొన్నెల నిండ త్రాగి మ
త్తిల్లి సురత్వ మొంది నవ
 దివ్య వసంత కళా విలాస సం
ఫుల్ల జగత్ ప్రమోద పరి
 పూరిత గీతిక లాలపింతమా !

గున్న మామిడి, తన ప్రియకోకిలమ్మ
వీడిపోయి ఆనాడు, తపించి, తిరిగి
నవ్యముగ నేడు కూడి గానమ్ము సేయు
నాంధ్ర తెలగాణ మేకమైనట్టి తమిని.

ఇంతటి శుభదాభ్యుదయ వసంత వాటి
నడుగిడు కతాన "దుర్ముఖి" యయ్యు, సుముఖి
యే యగునురా నవీనాబ్ద మెట్టు లనిన
శుక్తిగర్భాన పడు చిన్కు ముక్త కాదె !

(ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత తొలి ఉగాది సందర్భంలో 1957)

# మనశ్శాంతి

ప్రేమించలేదు నిన్ ద్వేషించలేదు, అ
ట్లని తటస్థముగ నుంటి నని కాదు
నవ్వించలేదు నిన్ కవ్వించలేదు, అ
ట్లని అరసికుడ నైతి నని కాదు
రమ్మనలేదు నిన్ పొమ్మనలేదు, అ
ట్లని పల్కరించ లేదనియు కాదు
త్వర పడలేదు నే పొరపడలేదు, అ
ట్లని ఋషీశ్వరుడ నే ననియు కాదు

మన చెలిమి తీరులోని ఆ మహిమ మేమొ
వింతగా కూర్చినది మనశ్శాంతి నాకు
నీరజ దళమ్ముపై నుండు నీర మట్లు
నేను నీతోడ కూడి యున్నాను.....?

శుక మీవె పిక మీవె చూతశాఖిక వీవె
శుక్తి వీవె నీవె మౌక్తికమ్ము
గిరి వీవె ఝరి వీవె ధరణీతలము నీవె
జలధి వీవే నీవె జలధరమ్ము
పూ వీవె తా వీవె పూలపందిరి వీవె
గంధ మీవే నీవె గంధవహము
కల వీవె నిజ మీవె కామరూపిణి వీవె
గీత మీవె నీవె శ్రోతచయము

జడము నీవె చేతన మీవె జాగృ తీవె
నిద్ర వీవె జీవన్మరణ ముద్ర వీవె
గమ్య మీవె నీవేను మార్గము శకటము
వింత ఏమి? నీకొరకె జీవింతు . . . !

# స్నేహసౌరభము

ఎక్కడి దాన వీవు, మరి
యెక్కడి వాడను నేను, ఎట్టులా
చక్కని సంజ వేళ ధ్రువ
సాగర తీరము మీద ఎందుకో
చుక్కల వోలె రాలిపడి
చూచితి మొక్కర నొక్క; రూహకున్
చిక్కని స్నేహ బంధమున
చిక్కితి మొక్క క్షణమ్ములోననే!

దాహము తీరె నాఎదకు
తన్వి! భవద్రస వాక్కులందు; సం
దేహము తీరె నాత్మకు ప్ర
దీప్త భవన్ముఖ హాస రేఖలన్;
మోహము లేని స్వచ్ఛ తమ
మోదము కూర్చు నిసర్గ రంజక
స్నేహము మించు భాగ్య నిధి
సృష్టిని లే దనిపించె నయ్యెడన్.

ఒకరిని చూడగానె ఎది
యో అనురాగము మోసులెత్తు, వే
రొకరిని చూచి చూడగనె
ఓర్వమి ద్వేషము పొంగులెత్తు, దే
నికి గల కారణమ్ము రమ
ణీ! కనరాదు వితర్క హేతు వా
దికి; మర జన్మ జన్మలకు
తీరవి వాసన లుండ కుండునా!

నా దేశ మీ వంక నీ దేశ మా వంక
నడుమ నున్నవి మహా జడధు లేడు
నా మతమ్మునకు నీదౌ మతమ్మునకును
వయసు భేదము వేల వత్సరాలు
కుల మున్నదను నాకు కులము లేదను నీకు
నడుమ అగాధ వర్ణవ్యవస్థ
నా రంగు నా రూపు నీ రంగు నీ రూపు
వెలుగు చీకటు లట్లు వేరు వేరు

ఇంత అంతర మున్న రవంతయైన
అడ్డు లేదయ్యె ఆత్మ సమైక్యమునకు
లౌకిక స్వార్థచింతనానేక బాహ్య
బంధనా లేల మన స్నేహ బంధమునకు?

ఉత్సాహము :
పాదు పందిరేని లేక పారు తీవ లట్టులన్
అది అంత మేది లేని అంబుదాల పోలికన్
రోదసీ హృదంతరాల లోని తార లట్టులన్
నాదమట్లు వేదమట్లు నాదు నీదు స్నేహమౌ.

పాడితి వీవు నా ప్రణయ
పల్లవ బాహురసాల శాఖలన్
వీడక నిన్ను పట్టుకొన;
వేల అకాల వసంత మాధురుల్
పాడెను; శీతవాతములు
భగ్గున మండెను; ఆ దినమ్మునే
నాడు స్మరించుకొన్న స్మృతి
నాళము మ్రోగును శబ్ద పేటియై!

నీవు పాడియు పాడించినావు నన్ను
నీవు ఆడియు ఆడించినావు నన్ను
భావములు నావి, పాటలో భాష నీది
ప్రేరణము నాది, నాట్యాల రీతి నీది.

వచ్చి పోవవచ్చు ప్రభువులు ప్రభుతలు
కాని - నిల్చిపోవుగా చరిత్ర
చచ్చిపోవవచ్చు సశరీర ప్రేమికుల్
చచ్చి పోదు ప్రేమ శాశ్వతమ్ము.

# మార్గదర్శి బూర్గుల

ఏదేశ చరిత్రైనా
ఆదేశ ప్రజల చేత ఆవిష్కృతమౌ
ఈదేశ ప్రజల శక్తికి
చేదోడైనట్టి కార్య సిద్ధులు పూజ్యుల్

రాచరికమ్మనల్పిన, ని
రంకుశ కర్కశ దుష్టభ్రష్ట పై
శాచిక పాలనమ్మను, ని
జామును అంతము చేయబూని, వీ
రోచిత శాంతి విప్లవ పు
రోగమనోద్యమముల్, తుఫానులై
లేచిన నాటి రోజులు స్మ
రించిన దేశము పావనమ్మనున్.

దేశభక్తియే శక్తిగా దీక్షబూని
పారతంత్ర్యము నెదిరించి పారద్రోలి
నట్టి దిట్టలలో గట్టిజెట్టివైన
బూరుగుల రామకృష్ణ జోహారునీకు !

రామకృష్ణుల దివ్య నామవిస్ఫూర్తి, నీ
పరిపూర్ణ జీవిత పథమువేసె
వామనత్వమునిన్ను ద్యోమండలమునిండు
విజ్ఞాన ప్రజ్ఞాన విదునిజేసె

నారసింహత్వమే కోరి భారతదేశ
 నాయకశిఖరాల నాటె నిన్ను
స్వాతంత్ర్య వాంఛ, సేవా భావ సంస్కృతి
 నీకు ఉజ్వల రాజనీతి నేర్పె

శారదయె సృజనాత్మక సత్వమిచ్చె
త్యాగమే నిన్ను కీర్తి సౌధమున నిలిపె
నీ సతి అనంతలక్ష్మినిన్ నిలిపి మదిని
కొలిచినది పరమాత్మను తలచికొనుచు

మంత్రివైతివి ముఖ్యమంత్రి వైతివికాని
 పదవిచే నీకు మత్తొదవలేదు
ప్రభువువైతివి రాజ్య పాలుడైతివిగాని
 మామూలు మనిషిని మరవలేదు
త్యాగివైతివి రాజయోగివైతివి గాని
 దర్పము నిన్నెప్డు తాకలేదు
జయముకల్గిన, పరాజయముకల్గిన గాని
 ధర్మమార్గమ్మెప్డు తప్పలేదు

సంపదలు ఉన్న లేకున్న సత్యసాధ
నమ్మునకు మిన్నలేదని నమ్మినావు
త్రికరణ విశుద్ధిగల కళాత్మకుడవీవు
మరచిపోదు చరిత్ర నీ మహితపాత్ర !

సంహరణ వాదమును త్రోసి సంస్కరణ వి
ధానమును ఆచరించిన ధార్మికుడవు
యోగమర్మజ్ఞుడౌ కర్మయోగివీవు
ఇహపరానంద సూత్ర సంహితుడవీవు !

సత్యదర్శన శీల సాహిత్యరుచులు
తెలుగు భాషకు ప్రేమతో తెచ్చి ఇచ్చి
మానవత్వపు విలువలు మప్పినట్టి
సత్వ గుణతత్వ రసకోకిలత్వమీవు !

నిన్ను తొలిసారినే కల్సి కొన్నయపుడు
ఓ అమాయిక విద్యార్థి నాయకుడను
నిన్ను మనసార తలచుకుంటున్న నేడు
కాలగతి చూచి భీతిల్లు బాలకుడను.

అధికారమ్మోధనమ్మో తప్ప మరియే
అంశమ్మొ రాణించలే
ద; ధిపుల్కారు వివేకవంతులు సు
విద్యాబుద్ధి సంపన్నులున్
బుధులున్ శాస్త్ర కళావిశారదులు,
సంపూర్ణాత్మ విజ్ఞానులున్
విధిసైతమ్మొ ధనాధి కారములకే
వీగన్ వలెన్ నేడహో !

చిరయశస్వీ! నిన్ను "శ్రీకృష్ణదేవరా
యాంధ్ర భాషానిలయము" న గంటి
మేధానిధీనిన్ అమేయ విజ్ఞాన సు
జ్ఞాన సాహిత్య భాషణల గంటి
సృజనశీలీ! నిన్ విశిష్ట భావావేశ
పటుతర కావ్య సంపుటల గంటి
రాజనీతిజ్ఞ! నీ లక్ష్య సాధనము, స
మైక్యాంధ్ర రాష్ట్ర దృశ్యమున గంటి

కంటి, కలగాదు, నిజముగా కంటి నిన్ను
నీ శతజయంతి ఉత్సావానేక సభల
కంటి అఖిలాంధ్రమందు, ఇంటింటిలోన
కీర్తిమయ! బూరుగుల రామకృష్ణరాయ!

కంటిన్ బూర్గుల రామకృష్ణుని
తెలంగాణా యశశ్శృంగమున్
కంటిన్ తెల్గుల మేటి స్వప్నమగు,
ఏకైకాంధ్ర రాష్ట్రావనున్
కంటిన్ నేటి సమైక్య భారతి ఒడిన్
గంగాత్మ శంఖాకృతున్
కంటిన్ నే శతవర్ష జన్మదిన
భోగంబందు మృత్యుంజయున్

బాప్పరెడ్డి

# కవితా చిత్రభాను

"కోహము కోహ" మంచడగు
　　కోకిల కంఠమునుండి పుట్టె, నా
'సోహము సోహ'మంచు కడు
　　చోద్యముగా నినదించు, భావ సం
దోహము, సంశయాత్మ పరి
　　తోషితమై, వెలుగొందె నూతనో
త్సాహము తోడ ఈ నవవ
　　సంత విలాస విభూతి రూపమై!

భృంగము వోలె, ఈ ప్రకృతి
　　ప్రేముడి పూచిన జ్ఞాన వేద వే
దాంగసుమాల సారములు
　　త్రాగుచు పొందిన పారవశ్యతన్
నింగిన నేలకున్ నడుమ
　　నిల్చిన మాయలమారి చీకటిన్
భంగముచేసెదన్ ప్రణవ
　　భావరసోజ్వల చిత్రభానుతోన్!

మౌఢ్యాల, జాడ్యాల కూడ్యాల ముందర
　　నీతి సిద్ధాంతాలు చేతులెత్తె !
ధనబల, అధికార దౌర్జన్యములముందు
　　విజ్ఞాన శాస్త్రాలు వీడిపోయే !

శిశిరాల స్వార్థసంస్కృతి దోపిడుల ముందు
త్యాగవాసంతాలు మూగవోయె
అవినీతి వ్యూహాల జవసత్వముల ముందు
న్యాయాభిమన్యుడు నలిగి పోయె

అందుకే నేను, నా అక్షరానుభూతు
లన్నిటిని రంగరించి సత్యామృతమున
సద్గుణోపేత చైతన్య శక్తి చేసి
పంచుచున్నా సుగాదికి పచ్చడి గను !

గుజరాతులో అగ్ని గుండాల పడిపోయి
పరితపించెడి మానవత్వమునకు
క్రూర కుతంత్రాల కొండవాలుల లోన
చితికి పోతున్న కాశ్మీరమునకు
కష్టాలకడలిలో కలవర పడుతున్న
నావ కన్పడని జనావళులకు
ఆశ నిరాశ దురావేశ విపనాల
స్రుక్కెడు వీరకిశోరములకు

దారిచూపించలేక, కన్నీరు గార్చు
భారతాంబను ఈ చిత్రభానుమూర్తి
కొత్తవెలుగుల అలరించ కోరినాను
విజయ పథముల నడిపించ వేడినాను

అరవైఏళ్ల క్రితమ్ము వచ్చి ఒక ఏ
డానాటి భూలోక భీ
కర సంగ్రామము చూచి భీతిలిన లో
కా నేక సంచారి, నే

డరుదెంచెన్ నవచిత్రభాను రసవి
ద్యా వైభవో పేతుడై
నరహింసాపరితప్త భారతపు ప్రా
ణాపాయముల్ బాపగా!

అయినది విచిత్రభానూ
దయము, నిశాంబర పిశాచి దర్పము లణగెన్
భయములు భ్రాంతులు తొలగెను
జయదాయినియై ఉగాది శాంభవి వెలుగున్ !

# ఆదిత్య రాగం

సృష్టికి మూలము సూర్యుడు
దృష్టికి మూలమ్ము సవిత దీధితి కానన్
సృష్టాకృతి పరమేష్టికి
సాష్టాంగ నమస్కరోమి, సత్యస్ఫూర్తిన్

అంతములేని ఆకసము
నందెటనో ఉపవిష్టుడై, అయ
స్కాంతమనస్కతన్ నిఖిల
సౌరకుటుంబము నాదరించుచున్
కాంతిని ధ్వాంతమున్ కరయు
గమ్మున త్రిప్పుచు దేశకాల వి
భ్రాంత విచిత్ర రూపకము
వ్రాసెడి భానుని కంజలించెదన్ !

తననేతాను జ్వలించుకొంచు పరమా
ర్థమ్మేను లక్ష్యమ్ముగా
జనకోటిన్ పశుపక్షి వృక్ష తతులన్
సంప్రీతి పోషింపగా
అనునిత్యమ్ము అకాండతాండవ దృశో
ష్ణాభా సుధాధారలన్
ప్రణవాత్మన్ కురిపించు ద్యోమణిని,
సంభావించి కీర్తించెదన్ !

ఇనుని రథములాగు ఏడుగుర్రాలేమొ
వారపు దినముల పేరులంట
పన్నెండు జతల ఇర్వదినాల్గు చక్రాలు
వత్సరంపు నెలలు, పక్షములట
ఆ రథాంగములోని ఆకులు ఎనిమిది
ప్రతిదినమున అష్ట ప్రహరములట
శ్రీహరిచక్రము, శివుని త్రిశూలము
భాస్కరు తను దీప్తి భాగములట

సూర్యమహిమా ప్రథితపరం జ్యోతి గూర్చి
గాధలను, బోధలను, సమారాధనముల
తెలిసికొను చున్న నాకనుల్ తెరచుకొనగ
భానుడే కానుపడు భగవానుడట్లు !

ఏనాడో రసరంజనార్కుడిల తా
నేలోకమందెన్నడున్
కానంగల్లని మోహనాంగి, జలధిన్
కన్విందుగా లీలగా
స్నానం బాడుటచూచి, చేరువగ కా
నన్ తేరు మళ్లించుచో
కోనన్ జారిపడెన్ శిలాలయముగా,
కోనార్కు సేవించెదన్ !

వేదాలు కొనియాడె ఆదిత్యునేనా డొ
ఆగస్త్యుడెరిగించె అతని హృదిని
మార్తాండుడేను త్రిమూర్తి స్వరూపుడు
అనుచు ఘోషించె గీతామృతాబ్ధి

ఆయురారోగ్యభాగ్యదుడు భాస్కరుడని
ఋజువుచేసెను మయూరుడను ఋషియు
గాయత్రి మంత్ర గానాయత్తమౌ రవి
చేతనమ్మే జీవ చేతనమ్ము
సకల విజ్ఞాన శాస్త్రముల్ ప్రకృతి శాస్త్ర
పాఠములు సూర్యదేవుని ప్రాభవమును
తలచికొలిచెడి సరిక్రొత్త దర్శనములె
అన్ని శక్తుల నిధి కమలాప్తుడేను !

నాదబ్రహ్మము ఛంద, మక్షరములౌ
నక్షత్రముల్, వేదముల్
పాదమ్ముల్, గ్రహముల్ ఉపగ్రహము
లే ప్రాసల్ యతుల్, మానవ
ద్యోదౌత్యాశయ దివ్యదిగ్విజయ
సందోహమ్ములే శైలియౌ
ఆదిత్యాంశువులేను భావములు
నా ఆత్మార్ద్ర కావ్యాలకున్

# కృతఘ్నత

సుందరాస్యము కళమాసి కంది పోవ
నుదుటి కుంకుమ ముంగురుల్ చెదరిపోవ
హతహృదయ దీన సందేశ మట్లు దుఃఖ
బాష్పములు రాల్చె దేలనో ప్రకృతిదేవి !

అరయ నీదు ఉపేక్షా స్వయంకృతాప
రాధములె నీదు శోకకారణము కాద ?
కాక ఎవరేని చింతయే లేక తన బ్ర
తుకును బహిరంగ పరచుకొందు రటె తల్లి!

ఎంత అమాయికమ్ము జన
 నీ! కనులారగ చూచుచుండియున్
వింత ప్రవర్తనాన కను
 పించిన ఈవిష మానసా ర్భకా
నంత హరమ్ములోని నట
 నమ్ము గ్రహింపక, జాలి బూని, క
ల్పాంతక దుష్కరాలకు మ
 హాబల మేల యొసంగినా వొకో ?
తెలియదటే మదంబ, భవ
 దీయ మహోజ్జ్వల జీవితమ్ములో
గల కన రాని శక్తి కళి
 కల్ - హృదయాలు నశించి నట్టి లో
భుల జ్వలితాగ్ని దృక్కులకు
 మోసములో పడి చూపినావు ! త
త్ఫలము విషాద బాష్పకణ
 ధారలు గాక మరేమి యౌనటో !

విశ్వరాహస్య విహగమ్ము పెంచి దాచి
ఇచ్చినావు జీవిత మూల్య మెరుగ నట్టి
నరుని రాతిచేతులకు, ఏనాడొ పీల్చు
అసురత దాని కోష్ణ ప్రాణానిలములు.

ఆ హిమ శైల శృంగతతి
యా, ఉరు వార్ధి తరంగ ధాటియా
వాహినులా, మరుత్తుల ప్ర
వాహములా - ఇపు డా నోపు త
ద్ద్రోహ కరాళ కాంక్ష ? ఘన
దోర్బల సంయుత క్రాంతి శాంతి హిం
సాహవయాత్రలన్ ? మనిషి
యాకృతి చేతనె మానవుండ టే !

ఉగ్రోగ్ర స్వార్థపరోన్మత్తనర్తకీ
విలయ నాట్యాల శిథిలముల గని
మతిహీన దుర్మార్గ కృత దానవత్వ కృ.
త్యాల వెల్వడిన రక్తాల గాంచి
కుటిల మూర్ఖత్వ సంకుచితత్వ తత్వాల
కేళీ నిమిత్త శోకాలను విని
ద్రోహాన అణుశక్తి దుర్వినియోగాన
కాల్చిన ధరణి వక్షమ్ము జూచి

తత్కృత కృతఘ్న తాపరాధము గ్రహించి
నే డయిన దానవత్వము వీడి నరుడు
స్వచ్ఛ మానవతా సుధా స్నాతుడైన
మానవుడు కాక పోడులే, మాను వగపు !

అతి సూక్ష్మ పరమాణువైన, అంతము లేని
బ్రహ్మాండమైన, చొరబడు వాడు
కుల మత జాతీయతల రాజకీయాల
ద్వేష భిత్తికల ఛేదించ లేడ ?
సెలయేటికన్న వెన్నెలకన్న విహగమ్ము
కన్న స్వేచ్ఛా విహాయస విహారి
సామ్రాజ్యవాద పిశాచి పీడిత ఘోర
వలస దాస్యమ్మును బాప లేడ ?

వానరుడు, దానవుడు కాడు, మానవుండు
అనెడి కీర్తిని గడియించు కొనును గాక !
నీకు ఆనంద నిధులను నించుగాక
ఓ ప్రకృతి మాత ! నీకు జయోస్తు ఎపుడు.

# రాగ భగవతీ !

ఈ భావ వనములందున
ప్రాభాత సమీర మట్లు పాడెడి నను, రా
శీ భూత సౌరభ జ్వా
లా భామినివోలె ఎందులకు కాల్చెదవే !

రాయినిగాను నేను జవ
రాల ! భవద్రసవాక్కు దృక్కు గం
గా యమునాపగోర్మికల
కాగితపుంపడ వట్లు తేలు, పా
పాయిని, రాగ పుష్ప మధు
పాయిని, నీ గుణరూప చైత్ర శో
భాయుత గీతికా రచన
మందు ఋషిత్వమునొందు ధన్యుడన్.

నీ కరబంధనాల నవ
నీతమువోలె ద్రవించి పోవగా
నీ కబరీభరమ్మున వి
నీలపయోధరమ్మై లయించగా
నీ కనునీడలందు దయ
నీయ ఖగ మ్మటు నిద్రపోవగా
నీ కలలన్ తలంపులను
నే నితివృత్తము కా తపించెదన్.

గాజుల మ్రోతలో విజయ
　　కాహళ గర్జలు చేసినాను, నీ
రాజమరాళయానమున
　　రాజ్యములెల్ల జయించినాను, నీ
రాజసమూర్తిలో భువన
　　రంజకకీర్తి గడించినాను, రా
రాజును నేను నన్ను రుచి
　　రమ్ముగ నేలెడి రాణివీ వహో !

దైవము నాకు కృష్ణుడు స
　　దా, తొలి రోజుల బాలకృష్ణుడే
దైవము నాకు, నా బ్రతుకు
　　దారులు చూపెడి వెన్నదొంగయే
దైవము, రాధికానయన
　　తామరసాశ్రుమరంద ధారలో
జీవన వేణుగాన మగు
　　శ్రీపతి దైవము నీకు నా కిలన్.

నీకును నాకు ఛాందసుల
　　నేమమునన్ యతి చెల్లదేని, గే
యాకృతిలోన ప్రాసయతి
　　నై జతనౌదును నీకు, మెచ్చు నీ
లోకము, భావుకాధునిక
　　లోక మహోభ్యుదయోన్ముఖ ప్రజా
నీకము, ప్రేమవాహినివి
　　నీకు రసాబ్ధిని నాకు అడ్డులా !

ఎందుకు నిన్ను గూర్చి ఎద
నింత తపింతును, తోలుబొమ్మవే
యందును, కాని అందె నుడి
కందని అందము లెన్నియో రసా
నందము లెన్నియో వెదకు
నా సకలేంద్రియముల్ మరెవ్వ రే
మందురొ కాని, జాలిపడు
మందును నాపయినిన్ త్రపామయీ!

స్నేహ పరీమళార్ద్రమగు
చిర్నగవొక్కటి చాలు, నందు దా
సోహము, ద్రోహబుద్ధి బల
శూరులు స్వార్థకుబేరు లందమౌ
వ్యూహము లెన్ని పన్నిన ప్ర
యోజన ముండదు నన్ను గెల్వ, సందే
దేహము లేదు నా క్షణిక
దేహము సత్యచిదాత్మ నీవె యౌ.

తీరములేని రోదసిని,
ద్వీపము దీపము వంటి జాబిలిన్
దూరము భార మం చనక
దోర్బల ధీబల సాహసాద్రులై
చేరిన వ్యోమగాముల వి
శిష్ట విచిత్ర చరిత్ర జూచి నిన్
చేరగవచ్చు నన్న ధృతి
చే నినుగోరితి నభ్రసూనమా !

కంబుగళంబు, చక్రముఖ
　　కంజ కళావిభవంబు, వీణ రూ
పంబు వహించు నీ జఘన
　　భాండము నీ తలబంతి నీ జడల్
బింబము లౌట శ్రీహరికి
　　విద్యలరాణికి, నామనంబు దే
హంబును పల్విధంబుల ప్రి
　　యా! నిను గొల్చుట సాజమే గదా!

కందము లిరుకడలుగ, నా
డెందము సూత్రమ్ముగా వడిన్ గ్రుచ్చిన ఈ
సుందర భావోత్పల మా
లం దమితో స్వీకరించు రాగభగవతీ !

అసురుల కొందర హతమార్చె రాముడు
అసురత్వమే నీవు అణిచినావు
దుష్టుల కొందరిన్ దునిమిరి పాండవుల్
దుష్టత్వమే నీవు దునిమినావు
నరహంతయౌ ఒక్క నరకు ద్రుంచెను సత్య
నరకత్వమే నీవు నరికినావు
మహిషు నొక్కని గూల్చె మహాలక్ష్మియౌ దుర్గ
మహిషత్వమే నీవు మాడ్చినావు

వ్యక్తివా కాదు, నవసంఘశక్తి వీవు
మనిషివా కాదు, ఉజ్జ్వల మానవతవు
ఇంటిలోపలనే కాదు, మింటిలోన
దీప మీవు, మా ఆశల రూప మీవు

(1971 డిశెంబరు యుద్ధంలో భారతదేశాన్ని వరించిన
అపూర్వ విజయేందిరకు పట్టిన అక్షర దీపం)

## నవభావ తపస్వి నాయని

నాయని సుబ్బరావును
ఘా యాంధ్ర సరస్వతీ కుమారుని, రసర
మ్యాయోగ భావ కవితా
శ్రీయుతుని స్మరింతు సృజన శీలాత్ముడనై!

భావము మృగ్యమై కృతక
　　భాష, పురాతన ఛాందసమ్ముతో
జీవము లేని సాహితిని,
　　జీవరాగము లేని అంధకా
రావరణాన త్రోసిన భ
　　యంకరవేళ, రసోదయమ్ములై
భావుక సీమలన్ వెలుగు
　　బాటలు వేసిన మేటి సత్కవీ!

ప్రణయ రసార్ద్రచిత్తుడవు
　　భారతదేశ చరిత్ర సంస్కృతీ
గుణగణ ఘోషణ ప్రగతి
　　కోకిలవై పరతత్త్వ బోధనా
ప్రణవ పరిమళ ప్రసవ
　　వాటికవై నవజీవనాత్మ చి
క్కణ మధురానుభూతి సహ
　　కార వసంతుడవైనదీనిధీ!

పుడమిలో తల్లి కడుపున పుట్టినట్టి
పిల్లలందరి హృదయాల పల్లవించు
అమ్మతనమును గూర్చిన ఆర్తులన్ని
మాతృగీతామృతమ్ముగా మలచినావు!

ఉదయలక్ష్మీకృష్ణ హృదయ రాగమ్ములో
పరిమళించిన రసప్రసవమీవు!
'వత్సల' ప్రణయ మహోత్సవ యాత్రలో
సృజన 'సౌభద్రుని' విజయమీవు!
నవరస భరిత సనాతన జీవిత
నూతన కరుణానుభూతి వీవు!
ఆధ్యాత్మికార్ద్ర భావానంద కేతన
మెగురవేసిన భాగ్యనగరమీవు!

బడులకే విద్య నేర్పిన ఒడయడీవు
గుడులకే భక్తినేర్పిన గురువు నీవు
ఉర్విలో నవ్యకవితా పయోధి వీవు
నింగిలో అక్షరానంద నిధివి నీవు!

# ఎఱ్ఱయ

ఆరణ్యములో చిక్కిన
భారత ఖండమును తెలుగు భారతి మెచ్చన్
ధీరోద్ధతి కాపాడిన
వీరా! ఎఱ్ఱయ్య నీకు ప్రేమాంజలిదే

హరి వంశయశము వోలెనె
స్థిరమై నీ కీర్తి హృదయసీమలలోనన్
విరబూచి వెలుగుచుండును
హరినర భేదమ్ములేని అద్వైతముగా.

ఒంగోలు మండలము ఉ
ప్పొంగెను ఆ చదలువాడ పొలిమేరలలో
పొంగెను నీ అద్భుత రస
గంగలతో ఆత్మయోగ.కళ్యాణముతో.

(9-6-1985) నాడు ఒంగోలు లో జరిగిన ఎఱ్ఱయ ఉత్సవాలలో
ఝుటితిస్ఫూర్తిగా చెప్పిన పద్యాలు)

# భజగోవిందం

(శ్రీ ఆదిశంకరాచార్యుల సంస్కృత మూలానికి అనువాదం)

భజనచేయుము గోవిందు భజన చేయు
మెపుడు మూఢమతీ! సమీపించునపుడు
చివరి కాలము, నిన్ను, రక్షించలేవు
లేవు వ్యాకరణాల వల్లింపు లేవి -

వదలివేయుము విత్తసంపాదనాశ
స్వచ్ఛతమ బుద్ధితోడ ఆశారహితము
చేసికొని, కష్ట ఫలముతో చేసి కొనుము
నీ మనస్సును ఆనంద ధామమెపుడు -

తరుణి కుచభార నత కటిస్థలము చూచి
ఎరవు కావద్దు మోహమత్సరత కీవు
మాంస వసరూప భేదము మాత్రమె అది
మరి మరి స్మరించు కొను మిది మనసు లోన -

జలజ పత్ర గతమ్మైన జలము వోలె
బ్రతుకు కడుచంచలమ్ము తరళతరమ్ము
రోగములును మోహావేశ రోగములును
ఆవరించిన ఈలోక మంత శోక
తప్తమని తెలిసికొనుము -

శక్తి, విత్తమార్జించు ఆసక్తి కలిగి
నంతదాకభిమానింతు రాప్తు లెల్ల
కాని జవముడిగి బ్రతుకీడ్చు కాలమందు
ఇంటిలో పలుకరించరు ఎవరు నిన్ను -

తనువులో ప్రాణమున్నంత దాక ఇంట
అందరును క్షేమమా అని అడుగు వారె
శ్వాస ఈ దేహమును దాటి వేసె నేని
భార్యయును ఆ తనువు చూచి భయము చెందు

అర్భకునిగ ఉన్నప్పుడు ఆటలందు
యువకునిగ నున్నయప్పుడు యువతులందు
బడుగుగా నున్న యపుడేమొ వగపులందు
కలిగియుందురు ఆసక్తి, కాని ఎవరు
పడరు ఆసక్తి ఆ పరబ్రహ్మ మందు -

ఎవరు నీ భార్య? నీ పుత్రు డెవడు? ఎంత
చిత్రమైనదో సంసార జీవితమ్ము
ఎవరి వాడవు? వచ్చినా వెచటి నుండి?
తత్వ మెరుగుము సోదరా! తలచి ఇపుడె -

సజ్జనులచెల్మి చేత నిస్సంగతయును
భువి నసంగత యందు నిర్మోహతయును
నిహత నిర్మోహతద్వార నిశ్చలతయు
పడయుదురు నిశ్చలతన జీవన విముక్తి -

వయసు మళ్ళినచో కామవాంఛ లేదు
నీరు ఇంకిన ఇంక కాసార మేది?
అడుగు వారేరి డబ్బంత ఉడిగె నేని
తత్వ మెరిగిన సంసార తపనమేది? -

వలదు గర్వము - ధనము, యౌవనము; జనము
కలవని; అవెల్ల మాయమౌ క్షణములోన
అరసి సర్వము మాయామయమ్మటంచు
బ్రహ్మ పదవర్తివగు మనుభవము పొంది -

రేయి పవలును, సంధ్యలు రెండు భువిని
శిశిర వాసంతములటు వచ్చి చనుచుండు
ఆడుకొనుచుండు కాలము, ఆరిపోవు
నాయు; నైనను వదల వాశానిలములు -

ఏల దారపై ధనముపై ఇంత చింత
నీకు ఓ వెర్రి! లేడా నిర్ణేత యొకడు;
త్రిజగముల భవజలధిలో తెప్పయౌచు
ఒప్పు సజ్జన సాంగత్య మొకటె సుమ్మి -
భజనచేయుము గోవిందు భజనచేయు
మెపుడు మూఢమతీ !.....

# నిరుపమానులకు ఉపమానం

ఆమె మనస్సు నింగి, హృద
    యమ్మొక అంతములేని భావతా
రామణి మంరమ్ము, మరి
    రాళ్లను రప్పలు చెట్టు చేమలా
రామము నా మనస్సు; అవి
    రమ్య రసాత్మదిగంత రేఖపై
ప్రేముడి కూడియే పవలురేలు
    వసించు విచిత్ర చిత్రమై!

చెదరిపోని హిమాలయ శృంగమాయె
స్థిరతయేలేని వాయువీచికను నేను
ఆమె రూపమ్ము స్పృశియించినంత లోనె
మాసిపోవునా కలతల మబ్బులన్ని -

కఠిన భాషా శిలా పదఘట్టనముల
నలిగి పోయెడి పాటల అలరు నేను
అఖిల భాషా వివాద శైలాగ్రములను
దాటి వర్థిల్లు భావ సౌందర్యమామె.

మతిచెడి ఆనందముకై
వెతికెడి అజ్ఞానఝరిని వెర్రిని నే, స
ద్గతియామె రసానంద,
ద్యుతియును ప్రజ్ఞాన జలధియును ఆమయెయా!

ఒకర్కు లేక ఒకరు ఉండుట యే లేని
ఒకరమేను మేము ఉభయులమును
ఎవరము ఎవరమని ఎరిగించగారాని
ఉపమ లేని జంటకుపమ మేము !

బాపురెడ్డి

# నెహ్రూజీ

రాలిపోయెను విశ్వంభరా కిరీట
రమ్య నవ జీవన చ్ఛటా రత్న మొకటి
తడిసిపోయెను మానవతా కవోష్ణ
బాష్పములలోన నేడు నా భరతభూమి.

శాంతికి చిహ్నమై భరత
జాతికి జీవన దాతయై జగ
త్ర్కాంతికి హేతువై నవ శ
కమ్మును నిల్పిన దివ్యభావనా
స్వాంతుడు ధర్మపాలకుడు
పండిత జవ్హారులాలు - నేడు లో
కాంతర వాసి యయ్యె, జగ
మంత విషాద విద విశీర్ణమయ్యెగా !

భిన్న మత భిన్న భాషా విభిన్న సంస్కృ
తీ నిలయమైన భారతదేశ వాసు
లందరిని ఐక్యపరచు రహస్య బంధ
నముల కనుగొన్న నెహ్రు లేడు మన కింక.

సర్వదేశ సమత్వ సహజీవన తటస్థ
నీతి నేర్పిన రాజనీతివేత్త
సకల ప్రజాభ్యుదయ కర ప్రణాళికా
సామ్య వాదార్థిక శాస్త్రవేత్త
విమల విశ్వప్రేమ విడని స్వార్థ త్యాగ
ధనము పెంచిన పూర్ణతత్వవేత్త
మానవావళి మనో మౌన వేదనలకు
శాంతి గూర్చిన మనస్తత్వవేత్త

పండిత జవాహరుండు ముప్పాతికేళ్ళు
తానె భారత దేశముగాను, భరత
దేశమే తానుగాను వర్ధిల్లిపోయె
నెహురు ఇహపర పూజనీయ హరిహరుడు.

దేశం బంతయు ఆ మహామహుని సం
దేశంబు పాటించి, స్వే
చ్ఛా శాంతి ప్రగతి ప్రదీపన సుదీ
క్షాబద్ధులై నాయకా
ధీశుల్ పాలనసేయునట్లు మము ఓ
దేవా! కటాక్షించి, పూ
ర్ణాశాభావము, త్యాగ శీలము, సమై
క్య శ్రీలు చేకూర్చుమా !

(27-4-1964 నాటి వేదనా తరంగం)

# యౌవనవీణ

రాలిన పూల తావుల స
రాగములన్ స్మరియించుకొంచు, దుః
ఖాలను పాడుకొంచు, నవ
ఖాండవ సూన సుధాస్రవంతి గా
నాలను బీటువారిన మ
నమ్ముల పారగ నీక; భగ్నలో
కాల సుఖింత మం చనెడి
కల్పిత తత్త్వ మసహ్య మయ్యెడిన్.

నా నవ యౌవనాంబరము
నన్ శివమెత్తిన కామ మేఘ రా
గాన సుమించునట్టి అణ
గారని ప్రేమ తటిల్లతా ద్యుతుల్
ప్రాణసఖిన్ ననున్ ప్రణయ
బంధమునందున చేర్చి నాకలో
కానుభవమ్ము గూర్చు; పరి
హాసము కామన లేని ప్రేమయా!

ఈ వాసంత వసంతికా రవములున్
ఈ శాద్వలీ శోభలున్
ఈ విద్యుల్లతికల్ మహోపవనముల్
ఈ నిర్ఝరుల్ పూర్ణిమల్
దేవీ జీవకళా విలాసములలో
దీపింప లేనప్డు ని
ర్జీవమ్మై చను గాన ఈ ప్రకృతిలో
జీవింతు దేవీ హృదిన్.

రెండు గుండెలు ఏకమై యుండుచోట
నేలబడు నిండు దుఃఖ భూతాల వేట
రెండు గుండెలె విడిపోయి మండుచోట
కాలబడు పండు సౌఖ్య పుష్పాలతోట.

ప్రణయిని సంస్మృతిన్ విరహ
రాగ విపంచికపై నిరాశగా
గొణుగుచు పాడుకొంచు బ్రతు
కున్ బలిచేయను చేతగామికిన్
వినిచెద యౌవనాభ్యుదయ
వీణియపైన విశీర్ణలోక వే
దనలకు చైత్రగీతములు,
తన్వి కవోష్ణ నవోష్ణ పాయినై.

(చిన్ననాటి రచన)

# అభివాదములు

కవుల నాదరించి కావ్యముద్రణలకు
వలయు సాయ మిడెడివారు అరుదు
నేటికాలమందు, నీ వంటివారు ఒ
యాసిసులు ఎడారులందు బావ !

లక్ష్మికల్గియు సాహిత్యలక్ష్మిపైన
గౌరవాదరణలు పెంచి గల్గినావు,
కర్మయోగిని సరస వాగ్ధురివి నీవు
రాజగోపాలరెడ్డిబావా జయోస్తు !

మనపరస్పర రాగ నూతన సుమాలు;
మన చిరస్వప్నవాటి పండిన ఫలాలు;
మన్మనోమేఘ భావ శంపాచ్ఛటలు : మ
దీయ చైతన్యరేఖ లివే యశస్వి !

నాకు ధైర్యసంపద లిచ్చినావు నీవు
ఎంచలేని ప్రేమము కురిపించినావు
నేను నీకేమీ అర్పింపలేను; సర్వ
దా కృతజ్ఞతాయుత మద్హృదయము తప్ప.

పుణ్యకార్యాల సాహితీ పోషణమ్మ
ఉత్తమము బావ! నా మాట చిత్తగించి,
తరుల పోషించు నవవసంతము విధాన
కవుల పోషించు మిల కలకాల మీవు.

(నా తొలి గ్రంథము "చైతన్య రేఖలు" 1960లో
ఒక ఆత్మీయుడు వెలిగించినపుడు)

# మహెూదయము

అదిగొ! ఉదయించె నేడు మహేంద్రదేశ
ప్రాగ్దిశా తీరమందు ప్రభాకరుండు
కోటి హస్తాలు సాచి ముక్కోటి మేటి
తెలుగులను హత్తుకొనె క వుంగిలిని ఒకటి.

కృష్ణవేణి గోదావరి కీర్తి వాహి
నులు మహానంద విమల వీచులు నటింప
స్వాగత మ్మిడుచుండె వేవేగ సాగి
ఆ ఉదయభాను మూర్తికి ఐక్యమతికి.

గత నిశా జీవితాల దుర్గతి సహించి
కఠిన తపమాచరించి నిక్కముగ నేడు
ఈ ప్రభాతాంశువులు సోకగా ప్రపుల్ల
మయ్యె తెల్గుల హృదయ పద్మాళి శాంతి
సౌఖ్య సుమధురాశాభావ సరసి లోన.

ఈ మహోదయ సందీప్తికే మహాత్మ
లెందరో జీవితాల నర్పించినారు,
ఇది మహేంద్ర భాగ్యోదయ మ్మిది ప్రజా వి
జయ మిది మహాభ్యుదయ రమా జయ విజయము

ఈ యమృతోదయ ప్రభల
ఈ ఎనలేని మహానుభూతిలో
నీ యెదలోని కల్మషము
నీటను దోసి, మనోజ్ఞ దివ్య శో

భా యుతమైన ప్రేమ సుమ
　　వాటిని నాటుము, తత్కళాత్మక
శ్రీయుతమౌ సుగంధములు
　　చిందగ సర్వదగంత వీధులన్.

సంకుచితత్వము, స్వార్థము
పంకిల మగు రాజకీయ, పన్నాగకళల్
శంకత్వము, మౌఢ్యము నే
డింక విడచి, శాంతి సుఖము లేలుద మిటుపై.

స్థిర మవును గాక ఆంధ్రప్రదేశ కీర్తి
ఉజ్జ్వల మగ్నుత భారతాభ్యుదయ దీప్తి
శాశ్వత మగ్నుత ఈ విశ్వశాంతి కాంతి
ప్రగతిభానుడు వెల్గుత జగతి నెపుడు.

(ఆంధ్రప్రదేశ్ అవతరణ సందర్భంలో దర్శించిన భావ చిత్రం-1956)

## కవితావలోకనం

నన్నయ, తిక్కన్నయు, పో
తన్నయు, శ్రీనాథ పెద్దనాది కవీంద్రుల్
ఎన్నగ, వరకవులగు, వే
మన్నలు కనిపెంచిన రసమయి, పద్మమ్మే !

ఛందోబద్ధత గల కవి
ఛాందసుడని ఈ సడించి, చదువకయే, ఏ
అందము చందము పద్యము
లందున లేనుట, వెఱ్ఱి యాటయె గాదా !

భావాలకు శబ్దమ్ములు
త్రోవలుగా ఒదుగ వలయు, దొరలెడు మాటల్
భావలె తమకు లొంగచు
పోవాలను కొనిన చితికి పోవును కవితల్ !

చప్పున వచ్చును కవితలు
చప్పుడు కాకుండ గుండె చప్పుడు నుండే
అప్పటికప్పుడె వాటిని
తప్పొప్పులు దిద్ది కాగితములద్చుకొనున్

ఛందములనందున కందాల్
కందర్పాస్త్రమ్ములగును, కవితలలో మా
కందరస కందళితములు
అందుకె ఊరించునన్ను, అవి ఎల్లెడలన్ !

కొందరు చెప్పెడి పద్యాల్
కొందరుడెందముల కద్దు కొనుగేయమ్ముల్
కొందరికి నచ్చు గద్యాల్
స్పందనతో వ్రాసితి చదువరులందరికై !

వచ్చిపోయెడి మబ్బుల వరదకాదు
పెరిగి తరుగుచు తిరుగు జాబిల్లికాదు
ముక్కలైనట్టి చుక్కల మూట కాదు
"కాదు", "లేదు" లు లేని ఆకసము కవిత

సృజనాత్మలనెడి కవులును
భజనాత్ములు ఔట ఆత్మ వంచన కాదా!
అజారాణి కన్న మిన్నగ
"నజరానుల" కొలుచువారి న్యాయమ్మెదో!

అందము, చందము, స్పందన
సందేశము స్వానుభూతి సరసత లేకన్
చిందులు వేసెడి కవితలు
పెందలకడ కాటికి శవపేటిక లౌలే !

పల్లవి దొరికినదని, నే
నుల్లము ఉప్పొంగదాని, నూరించితి, ని
న్నొల్లను పోయని పోయెను
పల్లవితో పాటు వలపు పాటయు పోయెన్ !

ముత్యాలవంటి పద్యాల్
సత్యాలను మణులతోడ, శారదమెడనా
దిత్యకళా భల సరులై
నిత్యానందమ్ము గూర్చు నిఖిలావనికిన్

ఇరుప్రక్కల "లఘువు" లతో
అరుదెంచెడి "గురువు" పగణమై, హుందాగా
సరియైన స్థానముననే
పరివిష్టుండగును, కంద పద్యమునందున్

తల్లిని నీవే, నా హృ
ద్వల్లిన నీవేను వాణి! వరకవితలు, నా
విల్లమ్ములుగా గొని ఘూ
ర్ణిల్లెడి చీకటి మృగాల నెల్ల జయింతున్ !

మైఖేల్ మధు సూదన్ దత్
భూఖండములన్ని కలుపబూనిన కవితా
లేఖిని గీచిన అక్షర
రేఖా చిత్రముల కంజ లించెద భక్తిన్ !

ఛందము నా నాలుకపై
సుందర నాట్యమ్ము చేయు సురుచిరముగ, నా
డెందము నవ కందములై
చిందును స్వచ్ఛంద భావ చేతన రుతులన్ !

ఏదో శోధించాలని
కాదో ఔనో వివాద గత తర్కముతో
ఏదో బోధించగ ని,
ర్వేదాటివి తిరుగు నొక కవీశ్వరు గంటిన్ !

పద్యమన్నను కంద పద్యమేనా యని
    అదరగొట్టును కొత్త ఆటవెలది
విలసనమ్ములు ఆటవెలదివేనా యని
    సూటిగా ప్రశ్నించు తేటగీతి
రీత శోభలు తేట గీతివేనా యని
    విరుచుక పడు వీర 'వృత్త' సేన
శైలి, శిల్పాలు వృత్తాల సోత్తాయని
    చిటపట లాడును సీస మేమొ
అందమగు ఛందముల పరిహాసములకు
పద్య కవులేమొ సంబర పడుచునుండ
పద్యముల శక్తి మింగుడు పడని వారు
చనిరి, పద్యాలు కొట్టుక చచ్చుననుచు !

'నేను' అనుమాట కర్థము నిర్ణయించి
'నీవు' అనునది ఎవరినో నిర్వచించి
'వస్తు' వేమిటో సూచించి, భాషరీతి
తెలిసివ్రాయని కవిత కేదిక్కులేదు

# నెదరులాండు

ఎగిసిపోయి మిన్నంట నే నెగసిపోయి
సింధువులు క్షేత్రములు గిరి శృంగములను
దాటి వ్రాలితి మంచుపూతోటలోన
రాగసాగర నవ్యతీరాల లోన -

ఎచ్చట చూచినన్ సుమము
　　లే సుమకోమల బాలలే సిరుల్
విచ్చిన జాడలే మధువు
　　వెచ్చదనమ్ములు పంచు వాడలే
పచ్చిక బీడులే ఘటని
　　భ స్తన గోవుల మందలే ఒహో
అచ్చర లుండు స్వర్గ మిది
　　యా యనిపించెడి వింతనేలలే.

చూచితి సౌందర్యమ్ములు,
చూచితి మధురుచులు, తాకి చూచితికొనుల్
చూచితి నవవాసన, విని
చూచితి జీవనగళాలు, చోద్యములెన్నొ !

"సురజగత్తున ఈ బీరు దొరకబోదు
కాన మనసార త్రాగు డిక్కడనె" యంచు
కొంటెనవ్వుల గుబ్బెతల్ కొసరి కొసరి
అమ్ముదురు బారులను బీరు "హైనకీను".

పని యొనరించు వేళ పొర
　　పాటున సైతము విశ్రమించ, రా
పని సమయమ్ము తీరగనె
　　పక్షులు పోలిక స్వేచ్ఛగా గృహాం
గణములయందునో ప్రియుల
　　కౌగిళులందునొ పానశాలలం
దునవొ వినోద మోదముల
　　తో పులకింతురు కార్యముక్తులై.

భగవద్భక్తి కళానురక్తి చిర సౌ
　　భ్రాతృత్వ సేవా సుధా
పగలే తుంగతరంగ హస్తములు పై
　　పై కెత్తి గొంతెత్తి మో
క్షగవాక్షమ్ములు విప్పి ఏవొ ఉపదే
　　శమ్మిచ్చు చున్నట్లు నా
కగుపించెన్ వినిపించె చర్చిగుడి గీ
　　తాలాపముల్ అచ్చటన్.

మానిని వృత్తం:
పిన్నలు పెద్దలు కన్నెలు ప్రౌఢలు
　　భేదము లెంచక వీధులలో
మన్ను చివుర్చగ మిన్ను గగుర్చగ
　　మంచు పరాగము నించుకొనన్
వెన్నెల కన్నెల పాటలు పాడుచు
　　వెచ్చని నాట్యము లాడి రహో
కన్నుల చూచియు నమ్మము అచ్చటి
　　"కారినివాలు" మహోత్సవముల్ !

విడి విడి నాట్యముల్ సలిపి
వేసట జెంది, రణించ వాద్యముల్
తడబడ పాదముల్ ఎదలు
తత్తర మొందగ, నాట్యశాలలం
దొడలు ఒడళ్ళు ఏకముగ
'ఒక్కరి నొక్కరు కౌగలించి ప్రే
ముడి యొనరింపగా నటనముల్
యువతీ యువకుల్; కనన్ వలెన్ !

కాచిన ఎండలో తళుకు
కాంతులు చిందెడి స్వర్ణ రాశులో
లేచిన సాగరోర్మికల
లేచిన సుందర రత్న రాశులో
తోచదు, నగ్నగాత్ర నవ
తోరణ పంక్తులు కట్టి సొంపుగా
బీచులు సల్పునేమొ కను
విందుగ గ్రీష్మమహోత్సవమ్ములన్.

ముద్దులుగార, జార జన
మోహన నగ్నవయో విలాసముల్
అద్దపు శాలలం మెరయ,
అత్తరు లత్తుక కాటుకల్ ఎవో
అద్దిన అందముల్ మరుని
అమ్ములుగా అనిసల్పు కామ పుం
విద్దెల వీరవేశ్య లట
వింతలకే గిలిగింత లయ్యెడిన్ !

"రంబ్రాంటు" తైల చిత్రాల శాలలను, "మ
స్దాఖు" లో కుడ్యచిత్రాలు చూడు
మంచి కంజలిపట్టు కంచు విగ్రహములు
"జగతి న్యాయస్థాన" శాంతిమహాలు
బృందావనమునకే విందౌ "కు కెన్ హోవు"
యమున బోలిన రైను రమణి చూడు
ఆలమందల చూడు అభిసారికల చూడు
పాడి పంటలు వన ప్రకృతి చూడు

చూడు "రాటరడాము" లో ఓడరేవు,
"స్ఖివినంగను" లోని విచిత్రములను,
మేడలను చూడు, వజ్రాలవాడ చూడు,
గాలి చక్రాలడైకుల లీల చూడు !

ఏగుము ఒక్కసారయిన
హేగు మహానగరమ్ము చూడగా
ఏగుము ఇంద్రభోగముల
నేలెడి ఆంస్టరడాము చూడ, త
త్సాగర తీర రమ్య సుమ
సాగర డోలల తేలిపోవుచున్
పాగుము డచ్చి వీరులు స్వ
శక్తి సృజించిన దేశమున్ కనన్.

# ఆత్మశ్రుతులు

వాసర లోన నీ భువన
వాసము, సర్వకళావిలాస, వి
ద్యా సుమహేల నీ మధుర
హాసము, త్రాసము లేని సత్య జి
జ్ఞాసయు దేశకాల గుణ
సత్వము తత్వములన్ పఠించు, నా
భాషయు భావమున్ నవన
వానుభవమ్ముల శక్తి నీవెగా!

యువనామవత్సరము, నను
భువిపై పడివేసి వెడలిపోయె నెటకొ! మా
నవజీవిత విపణిని నా
వ్యవహారము చూచి పోవ వచ్చెను మగుడన్.

నన్ను యువనామ శక్తియే కన్నకతన
చిరయువత్వము నా భావచేతనమున
వెలుగుచున్నది అమృతత్వ మలరి, ముదిమి
త్రాసమే లేదు నా కవితా సవితకు.

నను గని పెంచినట్టి కరు
ణామయి; సృష్టిరహస్య విద్య నా
జననములోన కన్గొనిన
శారదలక్ష్మి; ప్రపంచ మెల్లనా
కనుగవలోన చూచుకొను
క్రాంతి కిరణ్మయి; దేశకాల బం
ధనముల చిక్కి చిక్కని అ
నంత రసాకృతి మాతృమూర్తియే !

ఎనుబదియారు వత్సరము
　　లీ జగమందు వసించి వెళ్లిపో
యిన నను కన్నతండ్రి కను
　　పించును నా పరితప్త చేతనాం
గణమున, నేడు నేను పసి
　　కందువలెన్ పరికించుచుందు జీ
వన మరణాలనే యుగళ
　　పాత్రల నాటక కాలచిత్రమున్ !

నేను కవీశ్వరుండ నవ
　　నేరనుగాన రసార్ద్రకావ్య ని
ర్మాణమె ప్రాణమైన సుకు
　　మారుడ, అక్షర భావ శిల్ప సం
ధానుడ, నిత్య సత్య శుభ
　　దాయక జీవనగాన గర్భసం
తానము నేను, నేను పరి
　　తప్త జగజ్జననీ ప్రసన్నుడన్.

గణభంగమైన అంతగ
గణయింపను నేను పద్యకావ్యలందున్
గుణభంగమైన గుండెకు
వ్రణమైనటు తల్లడిల్లు రచనా శిల్పిన్

కాళీయ ఫణి ఫణాగ్రముమీద శ్రీపాద
　　నృత్యము నాలేఖినీ గమనము
అసురత్వ గర్భకుహరభేదనము చేయు
　　నఖతాండవమ్ము నా నవకవనము

దుర్నీతి దశకంఠు దనుమాడ జృంభించు
జ్యాగర్జనమ్ము నా శబ్దరవళి
క్ష్మాతలద్యోతలాక్రమణ చేసిన, బలి
వైరి పాదమ్ము నా భావపరిధి
నవత స్వచ్ఛంద యువత మానవత సమత
హక్కులకు చెక్కు చెదరని అభయశక్తి
నా తపోజాత నిటలాక్ష జాతవేద
కీల సుస్నాత నా సాహితీలతాంగి !

నాల్గు పాదాలపై నడచివచ్చెడి భావ
నందినీ బృందాలు నా కవితలు
ముల్లోకముల మూలములను దర్శించెడి
అక్షర ప్రభలు నా చక్షు యుగము
రెండు పుటలటుశరీరమ్ము ఆత్మయు
చెలగు పత్రమ్ము నా జీవితమ్ము
కాలచక్రములనకే క్రమ శిక్షణమునేర్పు
సాధనములు నా ప్రబోధనములు

నిత్య, జీవిత చిత్రాలు నేర్పుచున్న
మార్పు, మరణాది మోద ప్రమాదములకు
సార్ధకార్ధమ్ములును ప్రయోజనము తెలుపు
సత్య సాహిత్య రచన నా సత్వమెల్ల !

ఆదిలేని గతమ్మును, అంతులేని
ఆగతముతోడ, సరితూచు అలుపులేని
వర్తమానమ్మునౌ నా ప్రవర్తనమ్ము
నాకి అర్థమ్ము కాదు ఈ లోకమందు!

ఉభయ సత్యాల తీరాల నొరసి కొనుచు
నలిగిపోయెడి సందేహ నదిని నేను
ప్రశ్న లేవేవొ తరగెత్తి పలవరించు
ఉత్తరములన్ని కలవేమొ ఉదధి లోనె!

పరసేవా పరతత్పరుల్ ఇహపరా
ద్వైతుల్ స్థిత ప్రజ్ఞలున్
కరుణాంతః కరుణుల్ త్రికరణే
కైక స్థితుల్ సత్యవా
క్పరిశుద్ధుల్, జగమందు ఎచ్చటను ఏ
కాలాన కన్పించినన్
కరముల్ మోడ్చి శిరస్సు వంచుచు నమ
స్కారమ్ము లందించెదన్

చుక్కల లెక్కబెట్టుకొను
చుంటిని ఏమియు తోచనట్టి, ఈ
టక్కరి గుంటనక్కల గు
డారములైన పురాలలోన, కై
పెక్కిన అక్రమార్జనల
భీకర కృత్యములన్ పిశాచ తై
తక్కల పాపకర్మల అ
ధర్మములన్ ఎవరాపకుండుటన్

వానర దానవ వృత్తులు
మానవలోకమును శోకమయమొనరించే
మానవుల మార్చగల్గెడి
జ్ఞానోదయ కవిత వ్రాయ జాలిన చాలున్!

అందరు వ్రాయు పద్యములు
అందరు వ్రాసెడి గద్యముల్, రసా
నందము పంచునేని, సృజ
నాత్మక చేతన పెంచునేని, ని
ర్ద్వంద్వ మనస్కతన్ చదివి
దార్శనికానుభవమ్ము పొందెదన్
స్పందన కూర్పలేని కృతి
పై బుసకొట్టను, జాలిచెందెదన్

ఆకలి లేని కోకిలము
నై ప్రమతీప్స రసాల శాఖపై
చీకటి గొంతు విప్పి శ్రుతి
చేసితి "కోహము కోహమన్" స్వర
శ్లోకము సృష్టిమూలగత
శూన్యము సోహము, సోహమంచునా
లో కలిగించె సత్యగుణ
రూప విచార వివేచన స్ఫురన్!

కష్టసుఖములిచ్చి, కలిమిలేములు ఇచ్చి
ఈయలేదు బ్రతుకు ఎందుకొరకా!
కాలుచేతులుఇచ్చి, కర్మేంద్రియములిచ్చి
ఈయలేదు శరీరమెందుకొరకా!
విరులు తరులు ఇచ్చి, పికశుకమ్ములనిచ్చి
ఈయలే దామని నెందు కొరకా!
ఇల్లువాకిలి ఇచ్చి, పిల్లజెల్లలనిచ్చి
ఈయలేదు కుటుంబమెందుకొరకా?

వ్యాకరణమిచ్చి, ఇచ్చి శబ్దాకరములు
ఇవ్వలేదొక కావ్యము నింతవరకు!
శక్తియుక్తులు, సాధన సంపదిచ్చి
చేరవలసిన గమ్యము చెప్పలేదు!

తెలవారగనె లేచి తొలిసంజ వెలుగుల
నుతియించు క్రాంతి పక్షితతి రుతము
ఉన్నాడొ లేడొ దేవుడటంచు కొండల
కోనల వెదకు నదీనదములు
నింగి నంటగబోయి నేలపై పడిపోయి
మరిమరి యత్నించు మబ్బుగములు
అమ్లాన సత్య పుల్లాత్మలోయన వెల్గి
మ్లానమైపోవు సుమాలతీరు

వేదవేదాంత సారము విప్పినట్లె
విప్పి, విప్పిన నా కనుల్ కప్పుచుండు
తెలసినట్టులె తెలిసి నా తెలివి తెల్ల
వారుచుండును తామస ధారలొచు

చిననాడు బాలకృష్ణుడు
వెనరొలికిన యౌవనమున నేమో బృందా
వన కృష్ణుడు, గీతా బో
ధన కృష్ణుం డిపుడు నాకు దైవంబయ్యెన్!

భావ వనమ్ముల అక్షయ
జీవనరాగముల కూర్చి, శివ సుందర స
త్యావిష్కరణము చేసెడి
గోవిందుడు నా చిదాత్మ ఘోషకుడయ్యెన్!

పక్షుల కువకువలకు, నే
నక్షర రూపంబునిచ్చి, అజ్ఞాతజగ
ద్రక్షకునే అడిగితి, పశు
పక్షుల భాషల రహస్య భావములేవో!

# ప్రజా కవి జాషువా!

కులమత మౌఢ్యమ్ములపై
కలమెత్తిన మానవత్వ గళమెత్తిన కో
కిల సింహనాద కవితో
జ్జ్వల జాషువభాను మూర్తి! వాగ్రస కీర్తీ!

చీకటి గుడులలో చిద్రూపమెత్తిన
గబ్బిలమే నీకు గంటమయ్యె
ఆకలి బడులలో కేకలు పెట్టిన
కడగండ్లు నీ కావ్యకంఠ మయ్యె
నీచ మారీచ గజనీ గర్వ మడచిన
పిరదౌసి నీశక్తిపీఠ మయ్యె
సంపుటీకృత మైన సత్యసాహిత్య చే
తనము నీ విజయపతాక మయ్యె.

షాజహానుని ప్రేమార్ద్ర తాజమహలు,
సర్వసమతాప్రబోధి శ్మశానభూమి,
శిశిర పీడిత దళితుల జీవితములు,
ధన్యమైపోయె నీ భావ దర్శనమున.

ప్రవిమలగుణ సాగరుడవు
నవకవితా పద్య పద్మనాభుడవు ప్రజా
కవిశబ్ద రసాకృతుడవు
శివసుందర సత్యభావ శిల్పివి నీవే!

జనుల జీవనాడులను తంత్రులను చేసి
వినిచినావు రుద్రవీణ వాణి
కపట కలుషనాటకము లాడిన చరిత్ర
బుద్ధి వచ్చి తప్పు దిద్దుకొనియె!
శృంగారమునకు మేల్ బంగారు వన్నెల

భాష నేర్పిన ప్రేమవాది వీవు
స్వార్థ పంకిలమైన సంస్కృతికి విశుద్ధ
పథము చూపిన క్రాంతివాది వీవు
ఆస్తిక నాస్తికాద్వైత సిద్ధామృత
దృష్టి వెలిగించిన ధిషణ వీవు
కవ్వించు విషయము నవ్వించి చెప్పెడి
హాస్య భాష్యాల విన్యాసమతివి.

నిస్తులప్రతిభతో కావ్య వస్తువులను
అమర మొనరించు విద్యారహస్య నిధివి
ప్రస్తరాలను పరిమళ ప్రసవములుగ
మార్చగలిగెడి నైపుణి నేర్చినావు!

వాదాల పేరు లెందుకు
వేదాలె శిరమ్ము లూపు విజ్ఞత గల భా
వోదయ రోదసి నీ కవి
తాదృక్పథ మంతకన్న ధర్మము గలదా?

కారణజన్ముడా! భరత
ఖండ పురోగతి కడ్డులౌ దురా
చారములన్ని త్రుంచు యువ
శక్తుల భీమ విజృంభణాన నీ
పేర ప్రతిష్ఠితమ్మయి ప
విత్రత జెందిన సాహితీ పుర
స్కారము నాకు దక్కినది;
జన్మతరించినదయ్యా జాషువా!

అన్నా! నిన్ కబళింప లేదు మృతి, ది
వ్యాలోచనా దీక్షలో
కన్నుల్ మూసి అనంత కాల విలస
ద్ధ్యానమ్ములో లీనమై
యున్నా వందులకే భవత్కృతులభా
వోద్వేగ మీ జాతిలో
చెన్నారున్, వినుకొండ నీ ప్రతిభకున్
చిహ్నం బగున్ జాషువా!

# ఆత్మజ్ఞానం

ఇచ్చితివి నాకు పంచ కర్మేంద్రియములు
ఇచ్చితివి వాని నడుపు జ్ఞానేంద్రియములు
అన్ని ఇంద్రియముల తోడ ఆడుకొనెడి
ఆత్మతత్వము నెరిగించ వైతి దేవ!

బడులు పఠియించి, దర్శించి గుడులు ఎన్నొ
తెలిసికొన్నది ఏవియో తెలియరాదు
పఠనమే పఠనమును నేర్పె బడులు నాకు
మౌనమే మౌనమును నేర్పె మందిరాలు

గుడులలో ప్రశ్న పూజారి అడుగనీడు
బడుల కర్థము కాదు నా భాష యేమొ!
తెలిసికోవలసినది ఏదొ తెలిసె గుడిలో
తెలియజాలను లే యని తెలిసెబడిలో

గుడులలో గ్రుడ్డినైపోయి, బడులలోన
చెవిటినైపోయి నేనేమి చేయలేక
నీ తలపులందు మునిగి పునీతునైతి
మూగవోయినేనైపోతి యోగి నిపుడు.

బాపురెడ్డి

# పర్యావరణం-ప్రదూషణం

చుట్టెవరులేని యప్పుడు
చెట్టు మరొకచెట్టుకేమిచెపునోయని, నే
గుట్టుగ అడిగితి పక్షుల
మట్టినడుగుమంచు తుర్రుమని అవి పోయెన్

చెట్టు చెవులోన పక్షులు
గుట్టుగ గోప్యమ్ము లేవొ గుసగుస లాడున్
అట్టిటు తలూపును ఆ
చెట్టు సరేయంచు బదులు చెప్పనరీతిన్

తోటబడిలోన పక్షులు
పాటలు నేర్చుకొని రాగవాసంతములో
పోటిపడి పాడుకొను, ఏ
నాటికి నరకకుము చెట్లు, నాటుము మిత్రా!

వాసంత శోభ గూరిచి
హాసముతో పాడుకొనును అలరులు వనిలో
కూసెను కల కోకిలములు
ఆ నుమముల మెచ్చుకొను రసాత్మల వోలెన్

ఆడవిలో చెట్లు రాల్చెను ఆకులెల్ల
శిశిర వేదనలను లెక్క చేయకుండ
తనను ప్రేమించి పెంచిన తల్లివ్రేళ్ల
ఆకలిని తీర్చుకొరకు ఓ దార్చుకొరకు !

గతిలయలతోడ నర్తించు గ్రహములన్ని
కొమ్మలూపుచు చెట్లు నాట్యమ్ముచేయు
ప్రకృతిలో పుట్టి పెరిగెడు ప్రాణులెల్ల
నియమములను పాటించును నిష్ఠతోడ !

కుసుమ వనసీమ హాలండు "కుకెను హాపు"
పోయిచూడగనే విస్తుపోయినాను
నేనె విశ్వసుందరి, నేనె నేనెయనుచు
ప్రతి సుమము గర్వ పడుచున్న పగిది తోచె

కప్పులవలె పూవులు, పురి
విప్పును, వాసంత కాంతి విభవమ్మంతన్
గుప్పున తోడుకొనుటకై,
నిప్పులవలె ఎండలడ్డ నిలబడి యున్నన్...

ఏరులు పరుగులు తీసెను
జోరుగ పవనాలు జోడుజోడుగ వెడలెన్
నీరైపారిన నా ఎద
కోరికలుప్పొంగ కొండకోనలు చుట్టెన్ !

నింగి పరిచిన సువిశాల నీలిమముకు
నేల విరిసిన పచ్చదనాల నడుమ
పాడుకొనవలె సౌధాలు ప్రకృతి ఒడిని
స్వచ్ఛతమమైన సామరస్యాల పాట!

అడవి దారివెంట అలరుల బారులు
వెడల వలెను కాంతి కడలిచేర

కటిక చీకటింటి కాలుష్యములు దాటి
భక్త తోడ, ఆత్మశక్తి తోడ

ఏమయిపోయెనో ఎటు చూడ కన్పడు
జనపదమ్ముల పచ్చదనములు లిపుడు!
ఏమయిపోయెనో ఏ ఋతువైనను
సమయమునకు వచ్చు క్రమము ఇపుడు!
ఏమయి పోయెనో ఎంతవాడైనను
తప్పక పాటించు ధర్మమిపుడు!
ఏమయిపోయెనో సామాన్యులును చూపు
పరహితోన్ముఖ సుహృద్భావమిపుడు!

ప్రకృతి లోనను మానవ ప్రకృతిలోను
వికృతములు తెచ్చిపెట్టిన విద్యఏదో!
కాల చక్రమము మరల సక్రమముగాను
తిప్పగల్గు కాలాతీత దివ్యుడెవరో!

చెరువు లేదు 'పటనుచెర్వు'లో ఇప్పుడు
కుంటలేదు 'నల్లకుంట'లోన
నేతి బీరకాయ రీతియై పోయెను
మంచివన్ని నామమాత్రమాయె

పర్యావరణ సురక్షణ
కార్యము వదిలేసినారు కలుషితములకే
సూర్యేందు గ్రహములాదియు
పర్యావరణ ప్రధూష పణిఫణ హతులే

నాటి ఆటపాటల 'మూసి'ఏటి గొంతు
ఆరిపోయెను, 'గండిపేటా'రిపోయె
భాగ్యనగర కాలుష్యము పైన పడగ
(హైదరాబాదు కాలుష్యమావరించ)
ముక్కు మూసుక 'మూసియే' మూర్ఛపోయె

**మత్తకోకిల:**

చెట్టులే పరితప్త భూమికి శీత ఛత్రము పట్టురా
చెట్టులే ఇల మానవాళికి చేయి వీడని తోడురా
చెట్టు పచ్చగ నవ్వులొల్కిన చెమ్మగిల్లును మబ్బులే
చెట్టు రమ్మని చేతులూపిన చేరు పక్షుల దండులే

కలుషితము నీరు గాలియు
కలుషిత మాహారములును; కాలుష్యములే
తలలెత్తి కాటువేసెడి
ఇలలో ఈనాడుబ్రతుకు లేమౌనో గదా!

**వసంత తిలకము:**

వృక్షాలె పక్షులకు వెచ్చని
వృక్షాలె కారు అడవిన్ గూడులౌరా!
వృక్షాలు పెట్టుటయె వేవిధ పుణ్యమౌరా!
వృక్షాలు కొట్టుటయె భీకర పాపమౌరా!

ధర్మముల కెల్ల ధర్మము
పర్యావరణంపురక్ష ప్రగతి పథములో
కర్మాచరణము లన్నిట
పర్యావరణావనమ్మె ప్రాణప్రదమౌ!

బాపురెడ్డి

# స్వాతంత్ర్య సమర స్మృతులు

స్మృతిపథముల వెంట నడచి
అతులితులౌ దేశభక్తులందరి త్యాగో
న్నతులను గుర్తించుచు, హా
రతులిడుదము రండు అక్షరానందముతో !

ఇరువదవ శతాబ్దమునకు
కరములు జోడించి వేడి కన్నీరిడుచున్
బరువెక్కిన గుండియతో
విరబూచెడి స్మృతులతోడ వీడ్కోలిడదున్

కాలము అనంతమైనది
మూలములేకుండ పుట్టి ముగియుట ఎపుడో
తేలని నాటక మాడెడి
లీలావతియైన ఆ ఆలేఖ్యకు ప్రణతుల్ !

వచ్చినది, నవశతాబ్దము
ముచ్చటగా గత శతాబ్దముల దీవెనలన్
పుచ్చుకొనుచు నూరేడులు
పచ్చని జీవితము గడుప వచ్చెను ఇచ్చున్ !

వందేమాతర మంత్రము
హిందుమహాసింధువట్లు హిమనగమట్లున్
కుందెడి భారత జాతికి
స్పందన కలిగించె దేశభక్త్యోద్యమమై !

మనలో మనకు సమైక్యత
ఒనగూడక భరత దేశమొక కుక్కలుచిం
పిన విస్తరియై పోయెను
పెనగొన వలసాధిపత్య పెనుభూతమ్ముల్

కులతత్త్వపు విష వృక్షము
పలుకొమ్మలు వేసి భరత వంశమ్మును ము
క్కలు ముక్కలు చేసి, విని
ర్మల సంస్కృతికే, మహా ప్రమాదము తెచ్చెన్ !

లాలా లజపతిరాయుడు
కాలాతీతుండు బాల గంగాధరుడున్
నీలాకాశోత్తాల
జ్వాలావేశములు దేశభక్తిని నడిపెన్ !

"జనగణమన అధినాయక"
గుణగానము చేసె శాంతి గురుకులపతియౌ
అనుపమ ధీంద్ర రవీంద్రుడు
మనజాతికి గీతమైన మంత్రమ్మదియే !

గుండె బలమున్నచో, నా
గుండెకు గురిపెట్టుడంచు గుంటూరు ప్రకా
శం డుర్రిడి రొమ్మిడి గా
గుండెలదరినవి తుపాకి గుండ్లకు తృటిలో !

బెంగాలును విభజించిన
దొంగల వ్యూహమ్ముమీద దూకెను హిమవత్
శృంగములు, సేతుజలధిక
రంగమ్ములతో ప్రజా తరంగిణులెల్లన్ !

తన జనకుడు మోతీలాల్
తన కూతురు ఇందిరమ్మ తనమును వెనకల్
మన దేశ సేవ చేసిన
అనుపమ నెహ్రూజి జనగణా పనుడయ్యెన్ !

పందొమ్మిదవ శతాబ్దము
చిందిన స్వాతంత్ర్య సమర సింగపురక్తం
బందు జనించిన వీరుల,
ముందు స్మరించెదము, మౌన ముద్రాంజలితో

నానా సాహెబు త్యాగ
ప్రాణుని, మౌల్మి అహమదు పవిత్ర యోధున్
ధ్యానింతము ఝాన్సీ ల
క్ష్మీ నాయకురాలిని జయకేతన పాణిన్

కలకత్తా కాన్పూర్, రో
హిలఖండ్, ఢిల్లీపురము వహించన దీక్షన్
జ్వలియించె విప్లవాగ్నులు
కలిగించెను స్ఫూర్తి భావికాలమ్మునకున్

చొక్కా లేకుండా, చలి
రక్కసినేధిక్కరించి లండన్‌లో మ
త్తెక్కిన సామ్రాజ్యపు, తల
తిక్క విదల్చిన స్వరాజ్యధితి గాంధీయే !

వెనుదిరిగి పొండు, భరతా
వని నుండో వలసవాద పాలకులారా !
అని, గర్జించిన నాయకు
లను, గాంధిని త్రోసరి చెరలందు, మదాంధుల్

కారడవని రామునివలె
భారత రణభూమి కృష్ణభగవానువలెన్
స్వారాజ్యధుని సబర్మతి
తీరముపై గాంధిధర్మ దీక్షవహించెన్ !

కొల్లాయిగట్టి విరగని
విల్లువలెన్ కఱ్రపట్టి విశ్వమునేలే
తెల్లదొరల పరిపాలన
తల్లడిలిగ చేసె గాంధితాత విజయుడై !

సత్యముచేత అసత్యము
చైత్యోద్దీపిత అహింస చేతన్ హింసన్
నిత్యము జయించుటే స
త్కృత్యమ్మని చాటిన శుభ తీర్థుడు గాంధే !

ప్రతి సత్యాగ్రహి శాంతికి
ప్రతి రూపముకాగ, దాస్య బంధనములలో
చితికిన భారతమాతను
బ్రతికించె నహింసయనెడి బ్రహ్మాస్త్రమ్మె !

ఉప్పుకు పన్ను విధించుట
తప్పని చెప్పినను వినని ధవళప్రభుతపై
గుప్పెను సత్యాగ్రహమును
నిప్పులు, సాధించె'దండి' నీతివిజయమున్ !

మతములు మానవ జీవిత
హితభాషలు, సత్యవాణి హృద్ఘోషలుః దు
ర్మతులాశ్రుతులకు, విషమౌ
ద్ధ్యత వేర్పరి వారి పచ్చి స్వార్థము కొరకై

అల్లా బిసిమిల్లాయని
కల్లోలములేపిన మత కలహము: ఈశ్వర్
అల్లా ఒక పేరేనని
వల్లించిన వినక మాతృ వక్షము చీల్చెన్.

జిన్నామాటలు నిజమను
కున్నారేగాని గాంది గొంతు క్రోవిలో
చెన్నారెడి సత్యము కన
కున్నారని కుమిలి భరత కువలయమేడ్చెన్ !

ఆజాదు హిందు సేనల
ఈజాతి విముక్తి కొరకు ఏర్పరచిన నే
తాజీ! వీరచరిత్రుడు
తేజోమయ దేశభక్తి దీప్తుండయ్యె.

యుద్ధాలలోన భారత
యుద్ధము మించిన ప్రపంచ యుద్ధాలను స
న్నద్ధము చేసిన చరిత్ర
కిద్ధరణియు వీడుకోలు ఇడినిట్టూర్చెన్

భారతస్వాతంత్ర్యోద్యమ
వీరులు చెరలందు మ్రగ్గి విడగొట్టిరహో
భారత జననీ హృదయ వి
దారకమౌ దాస్యనిగళ దౌష్ట్యములెల్లన్.

గోపాలకృష్ణ గోఖ్లే
తోపాటుగ అనిబిసెంటు ధుర్యులు పెను దీ

క్షా పరులై పోరిరి, పరి
తాపముతో పారతంత్ర్య తామసితోడన్ !

రవి అస్తమించిన ధవళ సామ్రాజ్యపు
వలసాధిపత్యము బలిసిపోయె
పాలుత్రాగగవచ్చి పడిన పిల్లులలోన
రక్త దాహ మ్మెంతొౌరగిలిపోయె !
చదువులు శాస్త్రాలు సభ్యత నేర్పిన
సంస్కృతి స్వార్థ పిశాచ మయ్యె
మతబోధ హితబోధ మారువేషాలలో
హేయకుటిల రాజకీయమయ్యె !

ఖండఖండాల భారత ఖండమందు
జాతి వర్గ వివక్ష సంభూతమైన
దోపిడీలు దౌర్జన్యాలు దొరతనాలు
పాలు పోసిన సర్పాలు పడగలెత్తె !

ముక్కలు ముక్కలై కుమిలి
పోయిన భారత భూతులిన్ ఒకే
ఒక్క త్రివర్ణ కేతన స
ముజ్వల ఛత్రముక్రింది నిల్పినా
డొక్కడె ఉక్కు వీరుడు మ
హోన్నత సన్నుత దేశభక్తితో
చుక్కలలోన చంద్రుడు య
శోవధు వల్లభుడౌ పటేల్ ధరన్

బాపురెడ్డి

# కోటిరత్నాల వీణ

ఆగిపోలేదు రుద్రవీణా స్వనమ్ము
ఆరిపోలేదు నవకవితాగ్ని ధార
ఎగసిపోలేదు నీవు మా ఎదల నుండి
దాశరథి! నీకు అజ్ఞాతవాస మేల !

పుట్టిన దాది, చీకటుల
పుట్టలలో బుసకొట్టు నాగులన్
పట్టి విషమ్ము పిండి, నిరు
పద్రవ జీవనరుద్రవీణ, చే
పట్టి, ధరాతలమ్మునకు
పట్టిన పీడలు మట్టు పెట్టగా
పట్టిన దీక్షవీడని ప్ర
భంజన, మమ్మొటు వీడిపోతివో !

ఎన్నడు జన్మభూమిని స
హించగరాని అకించనమ్ము సం
పన్నము చేసి పోవునొకో! స్వా
ర్థపరత్వ పిశాచకంఠ వి
చ్ఛిన్నము ఎన్నడో యనుచు చిం
తిలి చింతిలి, నీ ప్రబోధముల్
పిన్నలు పెద్ద లాచరణ
పెట్టెడి మార్గము చూడబోతివో !

సర్వసౌఖ్యాలు వర్థిల్లు స్వర్గమట్లు
ఈ జగత్తును రూపించ నెంచి నీవు
అసలు స్వర్గము చూచిరా నరిగినావొ
దివ్యనిపుణులతో సంప్రదింపులేమొ !

"నా తెలంగాణ కోటి రత్నాలవీణ"
అనుటయే కాదు, ఆవీణ అయ్యె నీదు
అక్షరావేశ కవితాంతరిక్ష తంత్రి
అమృత భావాంబ రైక పద్య స్రవంతి !

సుత్తిదెబ్బలు తినుచు ఉసూరు మనెడి
రాళ్లగుండెలపై నీవు వ్రాసినట్టి
కవితలు శిలాక్షరమ్ములే కాక, అయ్యె
నిహత మానవతాత్మ కన్నీటిజాలు!

నీ, రుబాయి, గజలు నీకంటిపాపలై
నవ్వి,ఏడ్చి, వలచి, నాట్యమాడి
పంచిపెట్టె ప్రజకు పన్నీరు కన్నీరు
మర్మ ధర్మ, జ్ఞాన మార్గ మెరిగి!

ప్రేముడిని తెల్గు తల్లిని పిలిచినావు
కోరి నవభరతాంబను కొలిచినావు
దళితజనలోకమాతను తలచినావు
నిస్తులు యశస్సు పీఠిపై నిలిచినావు !

కసితో నిన్ పడద్రోసినట్టి రజనీ
కారాగృహమ్మందు నీ
వసి ధరానిశితారుణాక్షర లిపిన్
ఆసేతు శీతాచలో

ర్వి సుఖానంద మరంద గీతికల ఆ
వేశించి వ్రాయన్ ప్రభా
ప్రసవమ్ముల్ విరబూచె ఘోరపరతం
త్రధ్వాంతముల్ వీడగన్ !

సత్య సుందర శబ్ద శస్త్రాలు సంధించి
తిమిరాసురుల కడతేర్చినావు
త్యాగ రంజిత 'కవితా పుష్పకమ్ము' పై
వెలుగు లెల్లెడ చేరవేసినావు
ఆలోచనాలోచనాలోకనముతోడ
కళ్యాణదుర్గాలు కట్టినావు
ఒక మహోబోధివై ఒక శాంతి దూతవై
మనిషిని మనిషిగా మలచినావు

పద్యమైనను గేయము గద్యమైన
జీవకళ యయ్యె నీభావచేతనమున
వాద మేదైన నీ సిద్ధవాక్కుముందు
మోకరిల్లెను సత్యసమ్మోహనమున !

నందనవాటికల్, వితరణ
స్థిత కల్పక కామధేనువుల్
సుందరమైన అప్సరలు,
శోభలు, సర్వసమత్వ జీవితా
నందములున్, సుధల్ ప్రణవ
నాదము నిత్యము వెల్గుగాక, ఈ
కుందెడి భారతావనిని
కూడను దాశరధీ! భవత్కృపన్ !

(మహాకవి దాశరథి సంస్మరణ)

## కాలచిత్రం

"జీవితము" చేయ కాలము చితికి పోవు
"మృత్యువు"ను చేయ అది నిత్య సత్యమగును
దాని మహిమలు వర్ణించ తరము కాదు
ధాతకైనను ఆతని తాతకైన

మట్టిని చెట్టుగ చేయును
చెట్టును మట్టిగనుమార్చు చిత్రముగా, ఏ
దెట్టుల చేయునొ తెలియదు
పుట్టుట గిట్టుట రహస్యములపుట్ట అదే !

చేయు, శూన్యమునుండియే సృష్టిఎల్ల
త్రోయు, శూన్యము లోననే తోచినట్లు
గ్రహములను, తారకలను ఆకసములోన
వ్రేల జేయు నిశ్శబ్ద సూత్రాల తోడ !

దోస్తీ చేయును ఒకపుడు
కుస్తీ పట్టును ఒకపుడు కొందరితోడన్
నేస్తములని, శత్రువులని
ప్రస్తావన లేదు కాల బంధుత్వమునన్

కనులు లేవు కాలానికి, కాని కన్నును
అచిర చిర నిరాకార రూపములు కూడ
చెవులు లేవు దానికి కాని శ్రవణ శక్తి
కలదు, 'నిశ్శబ్ద' ములవిన గలదు ఎపుడు !

కదలదు మెదలదు కాలము
కదిలించును దేనినైన కదలకయే, ఏ
విధమైన మార్పు చేర్పులు
ఒదవని కాలమ్ము, మార్చు ఉర్విని ఎల్లన్ !

అన్ని నాటకములు ఆడి ఆడించెడి
కాలమే శివశక్తి మూలమేమొ !
అన్ని మాయలు పన్ని అగుపించకుండెడి
కాలమే మాంత్రికు రాలు ఏమొ !
బ్రహ్మకైనా అంతుపట్టక వర్తించు
కాలమే జ్ఞాన ప్రజ్ఞాన ధునియొ
ఏది పుట్టక ముందె 'ఆది' పుట్టకముందె
పుట్టకే పుట్టిన పట్టియేమొ !

ఇన్ని లీలలు చూపుకాలేశ్వరి, తన
గుట్టు తప్ప ఎరిగించును గుట్టులన్ని
ఎన్ని అధికారములు ఇవ్వమన్న నిచ్చు
మేదిని, జనన మరణాల మీద తప్ప!

# బాల్యానుభూతులు

నా సతి దేవతయని నే
చేసిన భావనలు నేడు సిద్ధించెనుగా
వ్రాసెద చెలియా, మన, సం
ధ్యాసమయమునందు సత్య దర్శన స్మృతులన్ !

ఇరువదవ శతాబ్దము, మన
ఇరువురికిని జన్మమిచ్చి, ఎనలేని కృపా
కరియై పోషించుచు, ఈ
చిరుదివ్వెల కారిపోని స్మృతులందించెన్ !

నా కోరికే జనించిన సనాతన నూతన ధర్మవర్తి ! నా
శ్రీకరసాంద్రకీర్తి ! నను శిక్షితు చేసిన జ్ఞానమూర్తి ! ఏ
చీకటి నైన బాపగల శీల, వివేక విచారశక్తి శో
భాకర దీప్తి, పుస్తకము పట్టని సత్కృతి పాణి వీవెగా

పుట్టిన నాడే నా చెయి
పట్టెదవని, ఏ వివాహ పద్ధతినైనన్,
పెట్టిరి దీవెన పెద్దలు
అట్టులనే జరిగె కాలమను కూలించెన్ !

నీ ఊరికి నా ఊరికి
ఓ ఆమడ దూరమే కదోయి సతీ ! నీ
ఊరున ఉన్నను, నే
నా యూరున నున్నయట్లె అనుపించుమదిన్ !

నా తల్లియు, నీ తండ్రి, ఒ
కే తల్లికి బిడ్డలౌట, ఈ బంధము, ఏ
ఏ తీరున చూచిన, ఆ
మాతలకే మాత యౌ ఉమా సత్కృపయే !

రామలక్ష్మి - కృష్ణ రసయోగ సిద్ధిలో
కన్ను విప్పిన జీవకణము నేను
శ్రీరామ చిలుక - లింగారెడ్డి, పుత్రికా
మేష్ఠి సంచిత వరసృష్టి వీవు !
సిరికొండ వనవాటి సెలయేటి పాటలో
గళమెత్తి నట్టి కోకిలము నేను
వంతడుపుల శుభావహా శివాలయదరి
గుస్తరించిన మావి గున్నవీవు !

ఎవరమేమైన ఇద్దరి యెడదలందు
ఒకరికొకరము సహజ రసోపమాన
మైన జంటల మైనాము మధుర మైన
కలలు కన్నను, వాస్తవికతలు కన్న !

అంతరము నీకు నాకు వయస్సులోన
ఏడు వత్సరములు, ఐన ఈడు జోడు
కలిసినదియని హితులు, లోకులు ప్రశంస
చేసినారట మనకు ఆశీస్సులిడుచు !

బాపూ! బాపూ! అని నను
చూ పరులందరును ప్రేమ చూపుచుపిలువన్
ఆ పేరిమి కూరిమియే
నా పేరై వెలిగెనసరి నా తలిదండ్రుల్ !

పేరులును, తనువులు వేరు వేరైయైన
ఒక్కటే పూవు రేకులట్లొదవి నాము
కలలు కన్నాము ఆశల కనులు తెరచి
బ్రతుకులకు బాట వేసిన బాల్యమందు !

సిరికొండ గుండె లోపల
చిరుదీపమ్మైన నేను చీకటి గుహలో
చొరబడి, వెదికితి జీవిత
పరమార్ధమ్మును పదార్ధ పరసత్యమ్మున్ !

లౌల్యముండియు లేనట్టి బాల్యమందె
తెలిసి తెలియని ఊహల తేలినపుడె
ఏది కల ఏది నిజమొ నే నెరుగనపుడె
బ్రతుకు ఒక గొప్ప వరమన్న భావమలరె !

అమ్మతొలిచూలివైనట్టి బొమ్మనీవు !
పుణ్యముల తోట పూచిన పుష్ప మీవు
సుతవు నీవె, ఆ యింటికి సతుడవీవె
పాపవైనను ముద్దుల "బాపు" నీవె !

కలసి, వేములవాడలో వెలసినట్టి
రాజరాజేశ్వరీశ్వరుల పూజచేసి
ఆదిశక్తి దివ్యాంశ నిన్నాదుకొనగ
పెట్టివారు "రాజేశ్వరి" పేరు నీకు !

"రాజవ్వ" యనుచు, వెన్నెల
రాజిల్లెడి నిన్ను పిలిచిరందరు పేర్మిన్

తేజస్వివైన నీవొక
రాజకుమారివె యటంచు ప్రజదీవించెన్ !

ఏడేళ్ల వయసు నాడే
మూడో తరగతికి ముందు ముగినిసన చదువే
ఏడేడు జన్మలకు, నిను
వీడని సంస్కారమయ్యె విభుదులుమెచ్చన్ !

"బాపు" అని ప్రేమ నీ మీద చూపినపుడు
బాపు, నేనుండ ఈ ఆడ బాపు ఎవరు !
అనుచు పరిహాసమాడిన అర్భకునికి
చూపు వైనావు, బాధలు బాపు సతివి !

బాలుడైనన్ బడికి
 పంపక గోవుల కాయుమంచు, నా
మేలును కోరియో, తలకు
 మించిన భారమటంచు ఎంచియో
జాలిగ తల్లిదండ్రులు, వి
 చారము చేసి వచించినారు, నే
నెలకొ ఏడ్చితిన్, చదువ
 యే నను పంపుడటంచు లీలగన్ !

కవిచేసెనన్ను, నిను ఆ
కవి హృదయముచేసి జంట కలిపెన్ మనలన్
కవి భావదర్శనమునకు
శివశక్తివి నీవె యొట సిద్ధులు కలిగెన్ !

ఏ సౌందర్యము చూచిన
ఆ సౌందర్యమున నీవె అగుపించుటచే
నా సాహిత్య సమస్తము
నీ సారూప్యమ్మె దార్శనిక సత్యమ్మె !

శ్రీకరవై, భీకరవై
రాకాసులనుండి నన్ను రక్షించుచు, పెం
జీకటిలో కూడా, న
న్నే కావగ వెంటనడచు నీడవు నీవె ! .

విడివిడిగ జన్మమెత్తి జీవితమునందు
ముడిపడి మమేకమైన రూపులము మనము
కలసియే వెళ్లిపో కలల్ కన్న మనము
ఎవరికని వారె యౌట ఊహించలేము

మరణమే లేదు అన్నట్లు మనిన మనము
ఎందుపోయెదమో మృతిచెందినపుడు
ఎందుపోయిన కలసియే యుందమచట
కాదనిన, కూడివత్తు మిక్కడికె మరల !

(అముద్రిక "కళ్యాణ యాత్ర" కావ్యం నుంచి)

# రసతరంగాలు

నీ కనుచూపులందు దయ
నించి, స్మితార్ద్ర వచస్సులందు ఏ
వో కలకండ మాధురుల
నుంచి, ముఖాన పవిత్ర చిత్ర భా
వాకృతులన్ రచించుచు గృ
హాంగణ సీమను కాలు పెట్ట గా
నే కలవోలె వచ్చి రమణీ! ఇడినా వల సాకు స్వాగతాల్.

నీ పిక వర్ణ చోళమును
నీ శుకఘోణ సదృక్ష చేలమున్
రూప విలాస రేఖలకు
రుక్ ముకురమ్ములు పట్టగా, కళా
క్షేప కరాంగుళాగ్రముల
కెంపు సితారను మీటి పాడు నీ
బాపురె బాపురే! కుసుమ
బాణుడు చూచిన మూర్ఛపోవడే !

రాలు కరంగు నస్వర శి
రమ్ములు వంగును కింకిణీ మృదం
గాల నటింతువేని, మధు
కావ్యగతమ్మగు తేనెలొల్కు నే
వేళ వచింతు వేని, గళ
వీణియ మోసిన సృష్టి పొంగు స
చ్ఛీలవు బాల! నీ విధి ర
చించెను సర్వకళా స్వరూపిగా!

రసికుల గుండెపూల మక
రందము చిందగ, వారె దో వసం
త సుమ వనమ్ములో గల వి
ధమ్మనుభూతిని చెందునట్లు నీ
వసదృశ భంగిమమ్ముల మ
హా నటన మ్మొనరింతు, చంచలా
మసృణ సురేఖవో గిరి కు
మారివొ నీవు కుమారి ఎంచగన్.

అరుణము నీ అధర మ్మది
అరుణము నీ ఫాల తిలక మరుణనఖమ్ముల్
అరుణము చూచుకములు మరి
అరుణిమె నీ కనుల కబ్బె, ఆగ్రహమేలా!

దివ్య మౌ నీ అధరపాన దీక్ష నిచ్చి
పూర్ణమౌ నీ స్మితామ్నాయ బోధ నొసగి
అక్షయాలింగనా సౌఖ్య మోక్షమిమ్ము
అంజలి ఘటింతు నో మోహనాంగి నీకు

# అంతరిక్ష విజయాలు

ఇరువదవ శతాబ్దమ్మున
అరవది తొమ్మిదవ వర్షమందున, జూలై
ఇరువదొకటి నాడీభువి
చరితమ్మున చంద్ర విజయ శంఖము మ్రోగెన్!

ఘన ఘనాపూర్వ విజ్ఞాన కవచధారి
భావనాతీత పృధు రోదసీ విహారి
రాగ మసృణ విశ్వంభర రాయబారి
అడుగు పెట్టెను చంద్రలోకాంగణాన.

తన నీర్జీవాంకము విడి
చనె జాబిలి యంచు వగచు జగదంబకు నే
డెన లేని పండు గయ్యెను
మనుజుడు భూమాత చంద్రమాతను కలిపెన్.

ఇతిహాసస్థ పురాణ వేద గత మౌ
    నీంద్రశ్రుతిక్షిప్త యో
గ తపోంతర్గత సృష్టి జీవన రహో
    గాధల్ ఎవో భావనా
లతలో స్వప్నములో విముగ్ధ మధురా
    లాపమ్ములో గాక, భా
వి తమఃక్షేత్ర సుషుప్త వాస్తవికతా
    బీజమ్ముల్ లేచెడిన్.

చెరగని ఆత్మజ్ఞానము
తరగని మేధా జనిత పదార్థ జ్ఞాన
మ్మిరు కడల వెడలి కలిపెను
పరిణామ ద్వంద్వ ప్రకృతి పథ మేళనమై.

భూమి జయించె మానవుడు,
భూరి పయోనిధులన్ జయించెగా;
వ్యోమము కూడ నే డసదృ
శోద్గమ మందు జయించి మించె, ఇం
కేమిటి, భావి జీవన గ
తిందిర లక్షిత లక్ష్య మేమిటో?
ఏమిటి ఏమి టంచు నిన
దించె నవే చకితాంతరాళముల్.

కరువుల కాటకాల్ బ్రతుకు
కష్టములన్నియు తీర్చు కొంటకై
వరము లభించెనా, పరుల
భాగ్యము కోసము నేలకోసమున్
జరిపెడి యుద్ధ తంత్రముల
జాడలు గోడులు మాసి పోయినా
దరణికి స్వర్గ సీమకును
దవ్వు కడుంగడు తీరిపోయెనా?

తన కుటుంబపు గొప్పతనముకై ఊ రెల్ల
'తగలెట్టు' సంకుచితత్వ నీతి
తన ఊరు పేరుకై తన రాష్ట్ర మంతకు
గరళమ్ము పెట్టు మూర్ఖత్వ నీతి
తన రాష్ట్ర ఘనతకై తన దేశవృద్ధిని
భంగపరచు దానవత్వ నీతి
తన దేశ యంశము కితర దేశముల బలి
దానము గొను మనస్తత్వ నీతి.

మానవు డజేయుడికనైన మానుకొనునొ
లేక, తన లోకమైన భూలోక కీర్తి
సాధనకు సర్వలోకాల శాంతి సుఖము
చెరగొనునొ, స్వార్థ లోభాలచేత జిక్కి.

# కవి కృషీవలుడు దువ్వూరి

స్వాభిమానము, ఆత్మవిశ్వాసదీప్తి
సూర్యచంద్రులు; నీదు యశోవిశాల
సాహితీలోకమునకు; రసానుభూతి
వాహినులు అయ్యె, నీ నవ్యభావవృష్టి!

నెల్లూరు మండలమ్మున
పల్లియ చిరునవ్వులోన ప్రభవించియు సం
పుల్లాత్మ చేతనత వ
ర్ధిల్లిన దువ్వూరి రామిరెడ్డి కవీంద్రా!

విలవిలలాడిన విలువల రక్షింప
ప్రజ్ఞాన గిరులెత్తి పట్టినావు
సత్యబంధవిముక్తి సల్పి, చీకటిమీద
కావ్యాల వారధి కట్టినావు
అసురత్వఘాత ధర్మాగ్రహ ప్రహ్లాదు
విజయగర్జకు శ్రుతి పెట్టినావు
సుఖదుఃఖచక్ర సంక్షుభిత జీవాత్మకు
నిజబోధిసత్వము నేర్పినావు

ప్రకృతి లోలోని మానవ ప్రకృతిలోని
తత్వముల సారమే, నీ సుధామయోక్తి
పూర్ణవిజ్ఞాన కవితా ప్రబోధమయ్యె
ఖండకావ్య కథాకావ్య భాండమయ్యె

ఏబది రెండు వత్సరము
లీ భువిలోన వసించి జీవితా
హోబిల మార్మికాక్షర ర
హోరసతత్వ మెరింగినావు, మే
ధాబలశాలివై పరమ
దార్శని కాభ్యుదయానుభూతి ప్ర
జ్ఞా బుధశాలి కోకిలమ
వై ఋషివై అభిరామిరెడ్డివై!

అన్నా! నీ కవితా కళా హృదయ భా
వావేశమున్ చూపగా
ఎన్నో భాషలు నేర్చినావు నవ సా
హిత్య ప్రపంచంబులో,
కన్నీటిన్ భరియించి నీ తెలుగు మా
గాణాల, విజ్ఞాన సం
పన్నంబైన అపూర్వ కావ్య నిధులన్
పండించినావో కవీ!

కవితలు చూచి మాన్య కవి
కాండము గుండెల కద్దుకోగ నీ
నవరస పూర్ణచిత్ర రచ
నల్ గని పొంగె కళామతల్లియున్
అవిరళ సాహితీ కృషికి
అంకితమైన త్వదీయ జీవితా
ర్ణవమున తేలియాడె రస
రాణి భవాని వివేక వాణియున్.

ఒక్క మధు పాత్ర చేబూని, చక్కనైన
చుక్క సాకీని కనులార చూచుకొనుచు
ఉమరఖయ్యాము పాడిన అమరగీతి
మానవునికి జీవనతత్వ "పానశాల".

వన్నె చిన్నెల పారసీ వనములందు
కైపుతో పాడు ఖయ్యాము కైతలకును
తేనె లొలికెడు నీ తేటతెనుగు త్రాపి
చోద్యముగ పదపదమ్మున చూపినావు
కొత్త కొత్త గమత్తుల మత్తులెన్నొ!

వాదవివాద దూర గుణ
వర్ధకమౌ ప్రతిభామృతమ్ములో
వేదములయ్యె మూలమును
వీడని నీ అనువాదముల్, రసా
స్వాదనలోను తాత్విక వి
చారణ లోను అనన్య సాధ్యమౌ
నీదగు "పానశాల" కృతి,
నీకు, ఖయాముకు నిండు కీర్తియౌ.

# చాటువులు

## స్వప్నం-సత్యం

ఒక్కటే అంతరమ్ము దేవునికి నీకు
స్వప్న మాతడు కనిపించు సత్య మీవు
అందుకే నిన్ను దేవుడా యంచు పిలువ
భయపడుచునుంటి నీమీది భక్తికతన.

## జన్మ రహస్యం

ఒక చోట గ్రుంకు రవి, వే
రొకచోట అదే క్షణమ్ము ఉదయించునటుల్
ఒకచోట గిట్టు జీవి, మ
రొక చోటనె పుట్టునేమో ఉర్వినెచటనో!

## కాలం విలువ

కాలమె జీవితము సుమీ!
కాలమును వృధా యొనర్చు కార్యములెల్లన్
మేలైన బ్రతుకులను, క
ల్లోలము పాల్జేసి మట్టిలో కలుపునులే!

## సత్కారం

సత్కార్యమ్ములు చేసిన
సత్కారము చేయవలయు సజ్జనులకు, ఆ
సత్కారము సత్కార్యమె
ఛీత్కారమె తగును దుష్ట చేష్టలకెల్లన్

## పరస్త్రీ

ఎన్నడును పరస్త్రీలను
కన్నెత్తియు చూడబోకు కలుషిత మతితో
నిన్ను వరించిన మగువను
మన్నికతో స్వీకరించు మనసొప్పిననే!

## సూర్యగ్రహణం

ఎవరిని నమ్మరాదు భువి
నింద్రునినైనను చంద్రునైన, భా
నువు తన కాంతి ధారలన
నూనముగా క్రైసేయ కీర్తి వై
భవములు పొందినట్టి శశి,
పట్టపగల్ కనుగట్టి సూర్యునే
అవలకు త్రోసి తద్పదవి
నాక్రమణంబొనరించ చూచుగా!

## భాష - భావం

భావము భాషపై తిరుగు
బాటొనరించును, భాషయేమొ త
ద్భావములోన జీవము ర
వంతయు లేదని ఈసడించు స్వా
భావికమైన రూప గుణ
బంధములన్ విడనాడి, భాషయున్
భావము మృగ్యమై తెలుగు
వాఙ్మయ వీధులు తెల్లబోయెన్

## త్రిగుణాలు

ధనమున్న చాలు సద్గుణముతో పనిలేదు
తెలుగు వాడాడని తెగపొగడును
అధికారమున్నచో అర్హులన్నిటిని
ఆంధ్రుడాతనికి జోహారులనును
ధనమధికారముల్ పెనవేసుకొని యున్న
తెలుగువాడాతని దేవుడనును
ఈ రెండు కలిగి రౌడీకూడ అయి ఉన్న
ఆంధ్రుడాతడె పరమాత్ముడనును

తెలుగు గడ్డపై నేడు, ఈ త్రిగుణశీల
మున్న వానికి, కొరత ఏమున్నదింక
ఏ ప్రభుత్వము చట్టాలు ఏవియైన
సర్వవిధ భోగభాగ్య గంధర్వుడతడు!

## వియోగం

చలి బాధ, అందులో నె
చ్చెలి లేని వియోగబాధ, శీతలమౌ వె
న్నెల బాధ, యౌవన తిమిం
గిల కోలాహలము బ్రతుకు గిజగిజ లాడెన్.

## ప్రాణేశ్వరి

వాన ప్రస్థాశ్రమమున
ప్రాణేశ్వరి మీద ఆశపడి, ఒకడాత్మ
జ్ఞానేశ్వరిని త్యజించి, ప్ర
జానాయకుడయ్యె, మరల జంబూద్వీపే.

**జంటలు**

నదికి ఇరు తీరముల తీరు, నాణెమునకు
బొమ్మ బొరుసు విధాన జగమ్ములోన
ఎంత వాడైన ఎపుడైన సంతు కొరకు
స్త్రీ పురుషులిద్దరుండియే తీరవలయు

**ప్యారెడి**

హితబోధకులకు ప్యారెడి
ఇతడే యనవచ్చునట్లు ఇటునటు దూకే
మతిమాలిన కవి కపి. దు
ర్గతి పాలైపోయి విషము గ్రక్కు నొరులపై!

**అభయ లాభాలు**

వస్తే మా యింటికి, ఏం
తెస్తావో, ప్రేమతో, ధీరత నేనే
వస్తే మీ ఇంటికి, ఏ
మిస్తావో చెప్పుమనెడి మిత్రుడు దొరికెన్

**ఓడరేవు**

భావుకుడ నేను ఒక ఓడ రేవు వోలె
మారవలెనని ఎంతయో మధనపడుదు
హితుల, నా ప్రియమైన స్నేహితులనెల్ల
పంపదలతు ఆనందాల వార్ధిలోకి!

**సంస్కృతి**

నవయుగము మీద యవనిక
యువతర మే తీయవలయు, ఉత్సాహముతో
నవతను యువతను కలిపెడి
సవితయె పరిణామశీలి సంస్కృతికిలలో

**పేరు కోసం**

ధర్మార్థ కామ మోక్షపు
మర్మముల నెరింగి బ్రతుకు మార్గములో, స
త్కర్మలు, క్రతువులు, వ్రతములు
పేర్మిని కావించె నొకడు పేరుగడించన్

**స్వేచ్ఛ**

స్వేచ్ఛయన్న ఎవరి చేయూత లేకుండ
సాగిపోవగల్గు సాహసమ్మ
నియమనిష్ఠలేని నీతిబోధల కన్న
పరహితమ్ముకోరు బాధమిన్న

**సూర్యశక్తి**

అటు మహాంబుధి ఇటు భూతలావరణము
పొంగులెత్తించె కాంతి తరంగములతో
చీకటుల ఆధిపత్యము చెదరగొట్టి
శౌర్యధైర్య సౌందర్యాల సారశక్తి

**గర్వభంగం**

నిర్వీర్యుడైన వానికి
గర్వమ్మదికమ్మ తానె ఘనుడనుకొనుటన్
నిర్వేలశక్తిమంతుని,
గర్వముకని పారిపోవు జ్ఞానోదయమై

**వృద్ధాప్యం**

అందము చందము లుడిగిన
సుందరి అద్దమ్ములోన చూచుకొనుచు, తా
నెందుకు జీవించితినని
కుందును తనగతము కుప్పకూలిన యట్లే!

### నమ్మకు

నమ్మకు . . . . ఎప్పుడు
ఇమ్మహినే కాదు స్వర్గ మేగిన అచటన్
నమ్మకు ఏ తీరున నిను
నమ్మించగా చూపునట్టి నటనల నెల్లన్

### గురజాడ

సంఘ సంస్కరణ భాషాశైలి నవ్యత
నాడి కన్యాశుల్క నాటకమున
సమత మానవత స్వేచ్ఛా మయ జీవిత
సత్యాలు, 'ముత్యాల సరము' లందు
దేశభక్తి అపార ధీశక్తి యువశక్తి
ద్రఢిమ ప్రబోధ గీతాల లోన
తెలుగు తేజస్ఫూర్తి త్రికరణ పరిశుద్ధి
ప్రచురితా ప్రచురిత రచనలందు

వెలుగజేసిన, విద్యావివేకనిధుల
జాడ తెలిపిన కవి గురజాడ ఋషియె
వట్టి మాటలు ఇక కట్టిపెట్టుడనుచు
మంచియన్నది పెంచి జీవించినాడు

### తప్పులే తప్పులు

'మందు' కొట్టుటయే తప్పు, అందులోను
వేపుడుల మాంసభక్షణ వెర్రి తప్పు
అర్ధరాతిరి వరకు ఆ ఆరగింపు
ఘోరమగు తప్పు, కొని తెచ్చుకున్న ముప్పు

స్వేచ్ఛయన్న ఎవరి చేయూతలేకుండ
సాగపోవునట్టి సాహసమ్ము
నియమనిష్ఠలేని నీతిబోధల కన్న
పరహితమ్ము కూర్చు బాధమిన్న

జనన మరణములకు మధ్య సాగు బ్రతుకు
కర్థ పరమార్థసా రసత్యమ్ము ఒకటె
బ్రతికి చచ్చెడి వారలే బహుజనమ్ము
చచ్చి బ్రతికెడి వారేమొ చాల అరుదు

## సమస్యా పూరణం

అనుపమ రూపవంతుడు ర
సాత్ముడు కాముని సన్నిభుండు, జీ
మధుమాస హాసుడు, శ
వంకర కోకిలగాన గాత్రుడున్
జనగణ ప్రీతిపాత్రనవ
చైత్రుడు వాడె, మనోజ్ఞమైన ఈ
వనములు, పూలు, పత్రములు
వాడె వసంతుడు వచ్చినంతనే.

(ఒక సభలో నేను సరదాగా పూరించిన సమస్య)

సమస్యాపూరణం:

ముల్లోకంబుల నేలు శక్తి కొకటే
　　మూలంబు దైవంబు, ఏ
కల్లోలంబులనైన మాన్పగల శ్రీ
　　కళ్యాణ వ్యాహోతుమ్మద్రై,
ఉల్లేఖింపగరాని మూర్ఖమతవై
　　రుద్యమ్ము లాపంగ, ఆ
అల్లా పుట్టెను, క్రీస్తు నింట, నరసం
　　హంబై అయోధ్యా పురిన్

(ఒక సభలో నేనిచ్చిన సమస్యను నేను పూరించిన తీరు)

సమస్యాపూరణం

కూరలు కాయలున్ తినక
　　కుక్కుటి మాంసము, మేక మాంసమున్
కోరక, భోగభాగ్యములు
　　కోరక, దూరక ఎవ్వరే పుర
స్కారములీయకున్న, చిరు
　　సందులలో తరియించుచుంట, సా
ధారణ సూకరమ్ములకె
　　దక్కిన విద్య తెలుంగు నేలలో!

(సమస్యాపూర్ణ స్ఫూర్తితో...)